# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

H. O. ఉమామహల్, మచిలీపట్టణము

ప్రొప్రయిటర్, టి. వి. సుబ్బయ్య




అందము ఆనందముకొరకు ప్రఖ్యాత "ఉమా" బ్రాండు బంగారు కవరింగు ఆభరణములనే కొనండి. బంగారు కవరింగు "ఉమా" లాకెటు చైన్లను స్త్రీ, పురుషులకు, బాలికలకు ఉపయోగించుకొనండి. అనేక సంవత్సరములు మన్నిక యుండి సంతృప్తి నిచ్చును. సామాన్య వి. పి. పార్సెలు ఛార్జీ రు. 1-37.

UMA 1036–958 CHAIN WITH MARY WITH CHILD DOLLER Rs. 7–50

UMA 1037–957 CHAIN WITH SITA RAMA LAKSHMANA & HANUMAN DOLLER Rs. 7–50

UMA 1038–714 CHAIN WITH HANUMAN DOLLER Rs. 7–50

UMA 1039–961 CHAIN WITH SRI RAMA PATTABHISHEKAM DOLLER Rs. 7–00

UMA 627–804 BLACK BEEDS CHAIN WITH JAYA LAKSHMI DOLLER Rs. 8–50

మా విక్రయ శాలలు :

| 90 - చైనాబజారు రోడ్డు, మద్రాసు - 1 | 581 - శివాలయం వీధి, విజయవాడ | 104 - అవెన్యూ రోడ్డు, బెంగళూరు సిటి |
|---|---|---|

కొంటలాగుకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు హెడ్డాఫీసుకు మాత్రము.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఫొటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

రచయితలకు మనవి :

మాకు పంపే రచనలతోబాటు తిరుగు టపాకు సరిపడే స్టాంపులు జతచేయ ప్రార్థన. అలా చేయనివారు దయచేసి తమ రచనల కాపీలు తమ వద్ద ఉంచుకోవటం మంచిది. అలాటి రచనలను గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటం సాధ్యంకాదని మనవి—సం.

# అన్నింటికీ మిన్న!






సాఠె బిస్కట్ & ఛాకొలెట్ కంపెనీ లిమిటెడ్, పూనా-2

**ప్రేమను యివ్వండి, సంరక్షణ చేయండి, మొడెల్లాతో అల్లిన దుస్తులను యివ్వండి**




తల్లిప్రేమ ఎల్లప్పుడూ కనపడుతూనే వుంటుంది. అలా కనపడే ముఖ్యమైన మార్గములలో **మొడెల్లాతో** అల్లిన దుస్తులు తొడగడము ఒకటి. **మొడెల్లా** దుస్తులు తొడిగిన మీ పాపాయి ముద్దొస్తూ వుంటుంది. మీరూ సొగసుగా కనపడతారు.

100% శుద్ధమైన ఆస్ట్రేలియన్ వూలు • పక్కా రంగు, ముడుతలు పడదు • 10 రకములు, 40 రంగులు.

**మొడెల్లా** ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి

MOL 614A TEL EVEREST

# లేఖలు

## నవంబర్ 1961

ఈ నెల [అక్టోబరు] నుండి "భారతచరిత్ర" ప్రచురించు చున్నందుకు చాల సంతోషం.

—ముప్పన సోమరాజు, పెద్దాపురం

"భారతచరిత్ర" ప్రచురిస్తున్నందుకు మాకు గార్కి నా అభివందనములు.

—గులపల రఘునాథయ్య, పసర్వారు

"రాకానిలోయ" చాల బాగుంది. "ఖలీఫా కనువిప్పు," "మాటల దుకాణం" కథలు చాల బాగున్నాయి.

—కనపరాజు రామకృష్ణ, బెంగుళూరు

"మాటల దుకాణం," "ఖలీఫా కనువిప్పు," "పళ్ళుబుట్ట గొడవ" [భీమన్న కథ] చాలా బాగున్నవి.

—జి. మాధవ క్రిష్టయ్య, ఊరపకొండ

"చందమామ"లో ప్రతినెలా ప్రచురిస్తున్న "గుండుభీమన్న కథలు" చాలా బావున్నాయి. రామాయణము కూడా బావుంది.

—జి. అనసూయ, సర్పవరం

"తప్పిపోయిన ప్రమాదాలు" [బేతాళ కథ] చాలా బాగున్నది. ఇలాంటి కథలు ప్రచురించు చున్నందుకు మీకు నా ధన్యవాదాలు.

—గుంట్రా మాలకొండయ్య, దుత్తలూరు

"చందమామ"కు, పాఠకుల కందరికి నా దీపావళి శుభా కాంక్షలు.

—వి. శ్రీనివాసరావు, మద్రాసు

"దక్షయజ్ఞం" కథ "చందమామ"కు వన్నె తెచ్చింది.

—జి. వెంకటేశ్వరరావు, మయూరాం.

"చందమామ"కు ఇదివరలోకంటె ఎన్నో రెట్లు వన్నె పెరిగింది.

—డి. సుబ్బారావు, పెద్దిపాలెం

"దక్షయజ్ఞం" [అక్టోబరు]లో పరమేశ్వరుని నృత్యము, వీరభద్రునియొక్క బొమ్మలు యెంతో ఆశ్చర్యంగా వేసిన చిత్రాది పాపయ్యగారిక్కి నా అభినందనములు.

—చీదెళ్ళ సత్యనారాయణ, శింగరాయకొండ

మన దేశపు అద్భుతాలు "అమరావతి" చాలా అందంగా వుంది.

వేమూరి శ్రీరామచంద్రమూర్తి గుంటూరు

"తప్పు చేయని ప్రమాదాలు," సన్నింతగానో ఆకర్షించింది. సీరియల్సు మిక్కిలి ఆనందాన్ని, అనుభూతిని కలుగ చేస్తున్నవి.

—గుమ్మడిదల శ్రీనివాసరావు, నిడమలూరు

ఈ నెల రామతీర్థ కథ లేకుండచేసి విచారం కలిగించ చేసినారు.

—వి. రామకృష్ణ, ఉనకరమిల్లి

"భారతచరిత్ర" విద్యార్థులకు చాల ముఖ్య మైనది. "రాకాసిలోయ," "దక్షయజ్ఞము," "గాలిమ ముక్క," "మాటల దుకాణం" చాల బాగున్నవి.

—ఎస్. నారాయణరావ్, నెలమంగలం

భారతచరిత్ర మొదలు పెట్టినందుకు ఎంతో సంతోషముగా ఉన్నది. ఇంకా రెండు పేజీలు పొడిగించమని కోరుతున్నాము. సీరియల్సు అమోఘముగా ఉంటున్నాయి. గుండు భీమన్న ప్రతి నెల మమ్ములను తెగ నవ్విస్తున్నాడు.

—కుమారి బొమ్మదేవర పాప, వుయ్యూరు

శ్రీ చి. మాధవరావుగారి మధురమైన కథలతో "చందమామ" మెరసి పోతుండడంలో ఏమంతయు అతిశయోక్తి లేదు.

—ఎ. వేణుగోపాలరావు, నారాయణఖేడు

# నవంబరు విడుదల!

యింతకు ముందూ - యింతవరకూ
ఆంధ్ర ప్రేక్షకలోకం కనీ వినీ ఎరుగని
వినూత్న - విశేష - చిత్రం!







రాజశ్రీ
వారి

# శభాష్ రాజా

తారాగణం: నాగేశ్వరరావు - కాంతారావు
రేలంగి - లింగమూర్తి - నాగభూషణం
దేవిక - రాజసులోచన - గిరిజ

నిర్మాతలు
సుందర్‌లాల్ నహాతా
డూండీ

దర్శకుడు
రామకృష్ణ

రాజశ్రీ
రిలీజ్

రచన
సముద్రాల (జూ.)

సంగీతం
ఘంటసాల

కెమెరా
కమల్ ఘోష్

కళ
అన్నామలై

నృత్యం
పసుమర్తి



# ఫిలిప్స్



ట్రాన్సిస్టర్ రేడియో
B4CA96T
ధర రూ. 595/-



మేజర్ రేడియో
B5CA86A - 7 వాల్వులు
ధర రూ. 695/-



మాస్టర్ రేడియో
B6CA86A
8 వాల్వులు - డబుల్ స్పీకర్లు
ధర రూ. 957/-



ఇంటర్నేషనల్ రేడియో
B4CA97A
ధర రూ. 551/-



మైనర్ రేడియో - B4CA07A
4 బ్యాండులు - 6 వాల్వులు
ధర రూ. 405/-



ఫిలెట్టా రేడియో
3 బ్యాండులు - 5 వాల్వులు - ఏసి/డిసి
ధర రూ. 308/-



ట్రాన్సిస్టర్ మైనర్
B4CA077 - ధర రూ. 510/-

**మోడరన్ ఆటో స్టోర్స్**
కాన్వెంట్ రోడ్ :: విజయవాడ.



పాప్యులర్ - B2CA09U
ఏసి/డిసి ధర రూ. 189/-




నాణ్యమైన
అందమైన
రేడియోలు ఇవే!




## లిటిల్స్
## ఓరియంటల్ బామ్

జలుబు, తలనొప్పి మొదలగు
బాధల నివారిణి




## జర్మెక్స్

నరుకులకు, గాయములకు, కాల్పులకు
పెట్టింది పేరు




లిటిల్స్ ఓరియంటల్
బామ్ అండ్
ఫార్మస్యూటికల్స్ లి.,
మదరాసు - 2.




మీ కేశ పోషణ పథకము
నేడే ప్రారంభించండి

లోమ గృహము నుండి
మరియొక శ్రేష్ఠమైన ఉత్పత్తి




హోల్ ఏజెంట్లు:
ఎమ్. ఎమ్. అంబిట్ వాలా, అహమదాబాద్

ఏజెంట్లు:
ఎ. పరోత్తమ్ అండ్ కో., బొంబాయి - 1

TM

తప్పక చూడండి!



హోమీ వాడియా
సమర్పించు











బసంత్. వాడియా బ్రదర్సు వారి

# సంపూర్ణ
# రామాయణం

(ఉత్తర రామాయణంతో సహా) (తెలుగు)



పూర్తి పంచరంగుల చిత్రం

పూర్ణా

దర్శకుడు
బాబూభాయి మిస్త్రీ

తెలుగు నిర్మాణం
ఫిలింసెంటర్
మద్రాసు



మాటలు-పాటలు
శ్రీ శ్రీ

సంగీతం
వసంత్ దేశాయి-విజయభాస్కర్



NAVIN

దీపావళి బహుమతులుగా ఇవ్వతగినవి.



ఈ గుర్తు గల స్టెయిన్‌లెస్
స్టీల్ పాత్రలు
గ్యారంటీ కలవి.

# I.M.M.C










FOR
*Anything &*
*Everything in*

**STAINLESS STEEL WARE**
& BRASS SHEET & CIRCLE





చిలుము పట్టవు, తుప్పు పట్టవు. ఎల్లప్పుడు
తళతళ మెరుస్తూవుండును.
తోముటకు చాలా సులువైనవి.

**ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్,**
498, మింట్ స్ట్రీట్ :: మద్రాసు-3.





అలసటవల్ల బాధ కలిగిందా?—అయితే

## స్లోన్స్ లినిమెంట్ వాడండి.

స్లోన్స్ వాడిన తక్షణమే వీపు నొప్పి, కండరాల నలుపు ఉపశమనం పొందుతాయి.

అటువంటప్పుడు మనమందరం 'మల్లులు'లాగ నిలబడాలి—అయితే, హఠాత్తుగా కలిగే శ్రమను, అలసటను మనలో చాలామంది ఓర్చుకోలేము. కీళ్ల నలుపులు, వాపులు వచ్చేస్తాయి. అలా నొప్పి పుడుతుందనేసరికల్లా స్లోన్స్ లినిమెంట్ వేసి రుద్దండి....! బాధ వున్న ఏ చోటుకైనా స్లోన్స్ వెచ్చటి రక్తాన్ని ప్రసరింపజేసి, బాధ నయం చేస్తుంది....వెంటనే బాధ పోయిందంటే, మీకు ఎంతో హాయిగా వుంటుంది. స్లోన్స్ యింట్లో వుంచుకోండి. నలుపులు మిమ్మల్ని బెదిరించినప్పుడు దీన్ని ప్రయోగిస్తే సరి.

ఇదేగాక స్లోన్స్ బామ్ కూడా దొరుకుతుంది—కండరాల నలుపులనుండి శీఘ్ర ఉపశమనం ఇచ్చుటలో మూడింతలు శక్తి కలది.




# స్లోన్స్ లినిమెంట్

"సీసాలో వైద్యుడు"

వార్నర్-లాంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమిత బాధ్యతతో యు. ఎస్. ఎ. లో సంయుక్తము కాబడినది.)

"నేడే
చూడండి"











శ్రీ రామకృష్ణ ప్రొడక్షన్స్

# టాక్సీ రాముడు

దర్శకత్వం వి. మధుసూదనరావు



ఆంధ్ర. వాహినీ ఫిలింస్ • సీడెడ్. నైజాం, మైసూర్. ఈస్టిండియా




రిజిస్టర్డు నం: 119923

## డైమండ్ సుగంధ వక్కపొడి

### ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధి చెందినదన్ని. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకింటికి 2 న. పై. మాత్రమే.

**ది డి. పి. అండ్ కంపెని,**
**కౌల్ బజార్ - బళ్ళారి - 1.**

సెల్సుడిపోలు

చీరాల, గుంటూరు, మాచెర్ల, కర్నూలు, ఆదోని, హుబ్లి, తిరుపతి, హైద్రాబాద్, రాయచూరు, బెంగళూరు, చిత్రదుర్గం, కంబమ్.




# ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో, అక్కడ ఆరోగ్యము వున్నది!

L. 36-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఉత్తమమైన డిజైన్లలో ఎన్నికైన టైపులను

ఇంగ్లీషు - తమిళం - మలయాళం - భాషలలో



సప్లయి చేయగలము



ఇవి గాక

పర్ఫొరేటర్లు, హేండ్ ప్రెస్సులు,

ట్రెడిల్సు, కటింగ్ మిషనులు,

ఇతరములైన

సమస్త ముద్రణ పరికరాలు మీకు

కావలసిన రీతులలో తగిన

వెలలకు మావద్ద దొరకును.



# ది మద్రాసు టైప్ ఫౌండ్రి

**38, జోన్స్ స్ట్రీట్ :: మద్రాసు - 1**



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ" పాఠకులకు మరొక దీపావళి వచ్చింది. ఈ సందర్భంలో ప్రత్యేక సంచిక అందిస్తున్నాము.

ఈసారి దీపావళి ప్రత్యేక సంచికలోని ప్రత్యేకాకర్షణ రంగుల వాష్ డ్రాయింగ్ చిత్రాలు. "చందమామ" ఇలాటి చిత్రాలతో వెలువడటం ఇదే ప్రథమం. ఈ చిత్రాలు గల "దేవయాని కథ", మరి నాలుగు పేజీలలో దీపావళికి సంబంధించిన కథలూ మీకు అందచేస్తున్నాం. ఈ కలర్ వాష్‌డ్రాయింగుల చిత్రాలు పాఠకులకు ఆనందాన్ని చేకూర్చగలవని మా విశ్వాసం.

ఈ సంచికలో మరొక ఎనిమిది పేజీల కథకూడా అదనంగా ప్రచురిస్తున్నాం. ఈ కథ రెండవ ఖలీఫా అయిన ఉమర్ శీలాన్ని వ్యక్తం చేస్తుంది. న్యాయబుద్ధి, ధర్మబుద్ధి ఎవరిలో ఉన్నా ఆదరించ దగినవే గదా!

ఈ సంచికతో మా పాఠకుల కందరికీ దీపావళి శుభాకాంక్షలు అందచేస్తున్నాము.

సంపుటి 29 : నవంబర్ 1961 : సంచిక 5



# భారత చరిత్ర



ప్రపంచంలో కెల్లా అత్యంత ప్రాచీనమైన నాగరికతలు ఈజిప్టు, అసీరియా, బాబిలోనియాలలో ఉండేవని ఒకప్పుడు భావించేవారు. కాని పంజాబు, సింధురాష్ట్రాలలో హరప్పా, మొహెంజొదారో (శవాలదిబ్బ) ప్రాంతాలలో బయటపడిన నగరాలను బట్టి 5 వేల యేళ్ళకితం మన దేశంలో ఒక ఉత్కృష్టమైన నాగరికత ఉండేదని, అది కాలక్రమాన భారతీయ నాగరికతగా రూపొందిందని స్పష్టమవుతున్నది. ఇదే సింధు నాగరికత.

మొహెంజొదారో, హరప్పా నగరాలను బట్టి ఆ నాగరికతను గురించి మనం అనేక విషయాలు తెలుసుకో గలుగుతున్నాం.

మొహెంజొదారో నగరం వరదల వల్ల నైతేనేం, ఇతర కారణాలవల్ల నైతేనేం శిథిలమై కనీసం ఏడుసార్లు నిర్మించబడి ఆ తరువాత శాశ్వతంగా శిథిలమై పోయింది. ఇది చాలా పెద్ద నగరం. అనేక ఇళ్ళు ఉండేవి. రెండే గదులుగల ఇళ్ళు మొదలుకొని రాజసౌధాల వంటివి కూడా ఉండేవి. వీటిని కాల్చిన ఇటుకలతో కట్టారు. పెద్ద ఇళ్లు రెండు మూడంతస్తులు కలిగి ఉండేవి. ఇళ్ళచుట్టూ ఖాళీ ఆవరణలూ, ఇళ్ళకు వాకిళ్ళూ, కిటికీలూ, సన్నని మెట్లవరసలూ ఉండేవి. దాదాపు ప్రతి ఇంటికీ బావి, మురుగు కాలవలూ, స్నానాలగదీ ఉండేవి. నేలపైనా ఆవరణలోనూ రాళ్ళు పరిచేవారు.

నగరంలో ఇళ్ళుగాక విశాలమైన కట్టడాలు కొన్ని ఉండేవి. అవి జనోపయోగమైనవి కావచ్చు. అలాటి కట్టడాలలో చెప్పుకోదగినది ఒక పెద్ద కొలను. దీని నిడివి 39 అడుగులు, వెడల్పు 23 అడుగులు, లోతు 9 అడుగులు. దీనిచుట్టూ మెట్లూ, గదులూ ఉండేవి. కొలనులోకి నీరు రావటానికీ, పోవటానికీ తగిన ఏర్పాట్లుండేవి.

**2. సింధు నాగరికత**



అంత ముఖ్యమైనవి కావు. గండ్రగొడ్డళ్లూ, ఈటెలూ, బాకులూ, గదలూ, వడిసెలలూ ముఖ్యమైనవి. ఈ ప్రజలకు ఖడ్గాలు తెలియవు. వీరు శిరస్త్రాణాలూ, డాలులూ మొదలైన రక్షణ సామగ్రి ఎరగనట్టు కన బడతారు.

సింధు నాగరికత నాటి శిల్పం చాలా గొప్పది. హరప్పాలో దొరికిన ప్రతిమలు కొన్ని గ్రీకు శిల్పాలకు ఏమీ తీసిపోవట. ఆ నగరాలవారు భారత దేశంలోని ఇతర ప్రాంతాలతోనే గాక ఆసియాలోని అనేక దేశాలతో వర్తకం చేశారు. ఇక్కడ పుష్కలంగా దొరికిన ముద్రల నమూనాలు రెండు మెసపొటేమియాలో దొరికాయి. ఇక్కడి హాయలు వ్యవసాయమూ, బహు విధములైన వృత్తిపనులూ నేర్చినవారు. సింధు ప్రజలు దేవి ఆరాధకులు. వీరొక పశుపతిదైవాన్ని కూడా ఆరాధించేవారు. ఈ పశుపతిరూప ప్రతిమచూస్తే శివుడి కిది ప్రాచీనరూపం అని తోస్తుంది. ప్రజలు విగ్రహారాధకులు, ప్రకృతిని ఆరాధించేవారు. వీరు హోమాలు చేసినట్టు కనబడదు. ఎందుకంటె ఎక్కడా అగ్నిగుండాలు లేవు.

సింధు నాగరికత ఆర్యులది కాదు. అది ఋగ్వేదకాలం కన్న ముందుది. ఆర్యులు నగరజీవితం ఎరగరు. వారికి ఇనుము తెలుసు. వారు విగ్రహారాధన చేయలేదు. సింధు నాగరికతను పెంపొందించిన వారు ద్రావిడులని కొందరూ, సుమేరియనులని కొందరూ, వారే వీరని కొందరూ వాదిస్తున్నారు. ఏ మైనప్పటికీ చరిత్రయుగంలో భారత దేశమంతటా వ్యాపించిన నాగరికత యొక్క బీజాలు వేదసంస్కృతిలో ఎంతగా ఉన్నాయో, సింధు నాగరికతలో అంత కంటె ఒక్కపిసరు హెచ్చుగానే ఉన్నట్టు కనిపిస్తుంది.

*మొహెంజొదారో నగరంలోని స్నానఘట్టం*





# దక్షయజ్ఞము

పంచమాశ్వాసము

వీరభద్రుడు సైన్య ధూళి
మినువీధిని చిమ్మరేగ;
ఉగ్రశివుని కోపమా యన
ఉత్తరదిశ ఎత్తివారె!

దక్షయజ్ఞాల లోని
తాపసులా దిశను చూచి,
కళవళపడ సాగినారు,
వెలవెల పో దొడగినారు!

ఎక్కడిది వింతగు చీకటి
ఏమిది! యని అచటి స్త్రీలు
ఒక్కచో గుమిగూడి నిలిచి,
ముక్కున వ్రేలిడి చూచిరి.

ఘనరథముల పెనుధూళులు
పొరగప్పిన యట్లుండెను;
ఉత్తరదిశ దక్షిణమున
కెత్తివచ్చి నట్లుండెను!

గణభటులా పెనుధూళిని
చీల్చుకొనుచు వచ్చినారు;
సంద్రపు కెరటాలవోలె
దర్పాన ఏతెంచినారు.

వీరభద్రుడపుడు చెయి
వీచెను తన సైన్యమునకు—
ప్రమథభటులు యజ్ఞాల
లోనికి చొచ్చుకపోయిరి.

వీరభద్రుడు శూలమును గొని
వెడలె యజ్ఞపుశాల లోనికి,
మడుగు జొచ్చిన మదపుటేనుగ,
అడవి దరికొను కారుచిచ్చుగ!

ప్రమథులపుడు వేదికలను
పర్ణశాలలను కూల్చిరి;
యజ్ఞాల కగ్గిపెట్టి,
యాజ్ఞికులను బంధించిరి.

ఊట్ల సత్యనారాయణాచార్య



పాతాళము దిగునట్లుగ
బల్లెముతో పొడిచినాడు;
అప్పటికిని దక్షుని ఒడ
లంతయును కసుగంద లేదు!

వీరభద్రుం డప్పుడు కత్తిని
పాఱవైచి, మహోగ్రహంబున
దక్షు శిరమును పట్టి పెఱికెను,
తమ్మిపువ్వును లాగునట్లుగ!

ఆ శిరస్సును వీరభద్రుడు
అగ్నికుండమునందు వైచెను;
ప్రమథు లప్పుడు ఉబ్బి యార్చిరి,
బ్రాహ్మణులు కన్నీరు గార్చిరి.

పీనుగు కుప్పలు, నెత్తుటిమడుగులు,
ప్రేవులును గల యా ప్రదేశము
భూత బేతాళముల కెంతయు
ప్రీతిగొల్పెడునట్టు లుండెను!

"శాంతింపుము, శాంతింపుము,
స్వామీ! నీ వెవ్వరవో?"
అనుచు వీరభద్రుని గని
అచటి స్త్రీలు మ్రొక్కినారు.

"శివుని కోపమువల్ల పుట్టిన
భద్రకాళి వీరభద్రుడవ!
దక్షయజ్ఞ ధ్వంసమునకై
దండు వెడలిన ప్రళయరుద్రుడవ!

బ్రతుకున మీ కాశయున్న
పరమశివుని వేడుకొనుడు!
రుద్రభటుల దయకంటెను
రుద్రుని కృప కొంత మేలు!"

అని వచించుచు వీరభద్రుడు
తనదు సేనలతోడ నరిగెను;
వెల్లనయిన యా యజ్ఞశాలయు
వల్లకాడుగ మారిపోయెను! —(సశేషం)






# 5

[వింతజంతువు ఆకారంలో వచ్చిన మాంత్రికుడి శిష్యుడైన జయమల్లుద్వారా, కేశవుడు చాలా విషయాలు తెలుసుకున్నాడు. తన మంత్రశక్తి చేత భూకంపం తెప్పించాననీ, బ్రహ్మదండి మాంత్రికుడు కేశవుడితో అన్నాడు. తరవాత తన శిష్యుణ్ణి పిలిచి, ఏనుగుల కొలనులో కేశవుణ్ణి స్నానం చేయించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడి ఆజ్ఞ వింటూనే జయమల్లు కేశవుడి చేయి పట్టుకుని అక్కణ్ణించి బయలుదేరాడు. "అంతా నాకు అయోమయంగా వున్నది. ఇంత పెద్ద కొండను తన మంత్రశక్తి చేత ఈ బ్రహ్మదండిగాడు ఊగించ గలిగాడంటే ఎలా నమ్మటం?" అన్నాడు కేశవుడు.

"వాడు మంత్రశక్తి చేత భూకంపం తెప్పించాడంటే నేనూ నమ్మను. నా అనుమానం కొండ కింద గంధకంలాటి పదార్థమేదో వున్నదని. ఆ కారణంగా కొండ అప్పుడప్పుడూ అదరటం జరగవచ్చు. అలాంటి సమయాల్లో బ్రహ్మదండి అందుక్కారణం తన మంత్రశక్తే అని ప్రగల్భాలు కొడుతున్నాడేమో. ఏది తేల్చి చెప్పటం కష్టం," అన్నాడు జయమల్లు.

ఆ సరికి యిద్దరూ కొండ మీద పల్లంగా వున్న ప్రదేశంలో గల ఒక కొలను దగ్గరకు









వచ్చారు. వాళ్ళు కొలనును సమీపిస్తుండ గానే, దాని అంచున వున్న గుహలలో నుంచి సింహగర్జన వినిపించింది. ఆ వెంటనే జూలు ఆడిస్తూ ఒక సింహం గుహ నుంచి బయటికివచ్చి, మరింత పెద్దగా గర్జనచేస్తూ ఒక రాతి మీదికి ఎగిరి నిలబడింది.

"ఇదే ఏనుగుల కొలను, ఆ మొసుగు తున్నదే మచ్చల సింహం!" అంటూ జయ మల్లు పెద్దగా నవ్వాడు.

"అన్నీ వింతలే! ఈ సింహానికి ఆహారం చెయ్యటానికి బ్రహ్మదండి మాంత్రికుడు నన్ను యిక్కడికి పంపలేదుగదా?" అను కుంటూ కేశవుడు అనుమానంగా జయ మల్లుకేసి చూశాడు. జయమల్లు తల ఎత్తి మచ్చల సింహంకేసి చూస్తున్నాడు. సింహం కోరలు చాచి, పంజా ఎత్తి కర్ణకఠోరంగా గర్జించసాగింది.

కేశవుడు సింహంకేసి ఓ క్షణకాలం పరీ క్షగా చూశాడు. అది ఏ నిమిషాన్నయినా రాతిమీది నుంచి దూకి తన మీదికి లంఘించ వచ్చని అతడికి అనుమానం కలిగింది.

కేశవుడు యిలా ఆలోచిస్తూనే విల్లం బులు పైకెత్తి మచ్చల సింహం తలను బాణాన్ని గురిచేశాడు. అతడు వింటి తాడును బాగా లాగి బాణం వదలబోతున్నంతలో జయమల్లు, ఢంకారి...లంకారి...మృగశక్తి కట్టు...అంటూ చప్పున కేశవుడికేసి తిరిగి, "ఏమిటి, నువ్వు చెయ్యబోతున్నది? నీ బాణంతో సింహాన్ని చంపగలననే అను కుంటున్నావా? నేను కట్టుమంత్రం వేసి దాని నోరు మూయబోతున్నాను. అయినా ఏదీ చూదాం, బాణం వదులు!" అన్నాడు పెద్దగా నవ్వుతూ.

కేశవుడు బాణాన్ని సింహం తలను గురి చేసి వదిలాడు. బాణం రివ్వుమంటూపోయి దాని తలను తాకుతూనే గ్రక్ మంటూ శబ్దించింది, అంతదూరం గాలిలోకి ఎగిరి కొలనునీటిలో పడిపోయింది.



"మహాశా, నీ బాణం ఒకటి వృథా అయింది తప్ప. సింహానికి ఏమీ కుట్టినట్ట యినాలేదు. ఇది బ్రహ్మదండి మాంత్రికుడి పెంపుడు సింహం. ప్రపంచంలో ఎక్కడా లేని ఈ మచ్చలసింహాన్ని తనే సృష్టించా నని వాడు చెపుతుంటాడు. కాని నేను నమ్మను. వాడు మాంత్రికుడేగాని బ్రహ్మ దేవుడు కాడు గదా? దీన్ని చిన్నపిల్లగా వున్నప్పుడే పట్టుకుని పైన ఏ చిరతపులి చర్మాన్నో కుట్టివుంటాడని నా అనుమానం," అన్నాడు జయమల్లు.

"అది అసంభవం. ఒక జంతువుకు మరో జంతువు చర్మాన్ని తెచ్చి కుడితే అది దాని శరీరంలో ఎలా కలిసిపోతుంది?" అన్నాడు కేశవుడు.

"అయితే, ఒకటి చేసివుంటాడు. ఇది చిన్నపిల్లగా దొరికినప్పుడే దాని శరీరాన్ని అక్కడా యిక్కడా కాల్చివుంటాడు. అవి మానిన తరవాత మచ్చలయివుంటవి," అన్నాడు జయమల్లు.

"అలా జరిగితే జరిగుండొచ్చు. అయినా, ఈ చర్చ అంతా ఎందుకు? ఈ సింహం వల్ల నా కేమీ అపాయం లేదు గదా— ఆ మాట ముందు చెప్పు?" అన్నాడు కేశవుడు కొంచెం విసుగ్గా.



"అపాయం ఏమీలేదు! ఇన్నేళ్ళుగా మాంత్రికుడి శిష్యుణ్ణయి వుండి కనీసం మృగాలకైనా మంత్రకట్టు వేయలేనను కున్నావా? చూడు, దాని కోపం ఎలా తగ్గిపోయిందో. ఇంకా సేపటిలో పిల్లిలా ఆ రాతిమీద బోర్లాపడుకుంటుంది." అన్నాడు జయమల్లు.

చూస్తూండగానే సింహం ఒక్కసారి గట్టిగా జూలు విదిలించి, ఆవలిస్తున్నట్టు పెద్దగా నోరు తెరిచి, బల్లిలా రాతిని అంటి పెట్టుకుని పడుకున్నది. కేశవుడు జయ మల్లు మంత్రశక్తికి ముగ్ధుడయాడు. నిజంగా వీడు తనకు స్నేహితుడైతే, బ్రహ్మ








దండి మాంత్రికుడి నుంచి ప్రమాదం లేకుండా తేలిగ్గా పారిపోవచ్చనుకున్నాడు.

జయమల్లు ఏనుగుల కొలనులో దిగి బుడుంగు బుడుంగుమని మునుగుతూ, "చూస్తావేం, కేశవా. దిగు, స్నానం చెయ్యి. మన కోసం బ్రహ్మదండి కని పెట్టుకుని వుంటాడు," అని కేక వేశాడు.

కేశవుడు విల్లంబుల్ని కొలను ఒడ్డున పడవేసి కొలను నీటిలో దిగి స్నానం చెయ్యసాగాడు. బహుశా తాను స్నానంచేసి శుచి అయిన తరవాత మాంత్రికుడు తనను కాల భైరవుడికి బలి యివ్వాలనుకుంటున్నాడని అతడికి తోచింది.



కేశవుడు తన సందేహాల గురించి జయమల్లును అడుగుదామనుకున్నాడు. కాని, జయమల్లు కొలనులో చాలా దూరంపోయి కేరింతలు కొడుతూ ఈతలు వేస్తున్నాడు. కేశవుడు మెల్లిగా ఈదుతూ అతణ్ణి సమీపించి, తన భయాలను గురించి అడిగేందుకు పెదాలు కదిపేంతలో, కొలనుకు ఆ వైపునుంచి, రాళ్ళూరప్పలూ దొర్లిపోతున్న ధ్వని, ఆ వెంటనే ఏనుగుల ఘీంకారాలూ వినిపించినై.

"ఏనుగు మంద కొలనుకు వస్తున్నట్టున్నది?" అన్నాడు కేశవుడు.

"దీని పేరే ఏనుగుల కొలను గదా, మరి యిందులో స్నానాలు చేసేందుకు ఏనుగులు రాక మరేం వస్తవనుకున్నావు?" అన్నాడు జయమల్లు నవ్వుతూ.

"అలా అయితే మనం త్వరగా యిక్కణ్ణించి పారిపోవటం మంచిది. అవి వచ్చి పడినవా, మనం వాటి కాళ్ళకింద తునాతునియలైపోతాం!" అంటూ కేశవుడు ఒడ్డుకేసి గబగబా ఈదసాగాడు.

జయమల్లు కేశవుడి భయంచూసి పెద్దగా నవ్వాడు. చూస్తూండగానే అయిదారు ఏనుగులు ఒకదాన్ని ఒకటి తోసుకుంటూ, తొండాలతో కొలను పక్కనవున్న చెట్ల



కొమ్ములను అలవోకగా పట్టివిడుస్తూ కొలను ఒడ్డుకు వచ్చినై. వాటిని చూస్తూనే జయమల్లు బుడుంగున నీటిలో మునిగి చప్పున పైకివచ్చి, పెద్దగా మంత్రం పఠిస్తూ, యింత బురదను ఏనుగలకేసి విసిరాడు. ఆ మరుక్షణం ముందువచ్చిన ఏనుగులూ, వాటిని అనుసరించి వస్తున్న మరికొన్ని ఏనుగులూ ఉన్నచోటునే కదలామెదలక స్థాణువుల్లా అయిపోయినై.

"చూశావా, మనశక్తి!" అంటూ జయమల్లు కేశవుడి కేసి పెద్ద కేకపెట్టి, నిదానంగా ఈదుకుంటూ కేశవుడున్న చోటికి వచ్చాడు. కేశవుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. నిజంగానే జయమల్లు గొప్ప మాంత్రికుడనుకున్నాడతడు.

కేశవుడి ఆలోచనల్ని పసికట్టిన వాడిలా జయమల్లు తల వూపి, "నోరూ వాయీలేని మృగాలనూ, పక్షులనూ లొంగదీసుకో గలగటం ఏమంత గొప్ప శక్తికాదు. ఇలాంటి స్వల్ప శక్తుల్ని బ్రహ్మదండిగాడు చెయ్యా కాలా కదపకుండానే ప్రదర్శించగలడు. రాకాసిలోయలో ప్రవేశించి, అక్కడవున్న గొప్ప గొప్ప నిధుల్ని కొల్లగొట్ట గల శక్తిని సంపాయించినప్పుడే మనం నిజమైన మంత్రవేత్తలం అవుతాం," అన్నాడు.

"ఆ రాకాసిలోయ ఎక్కడున్నది?" అని అడిగాడు కేశవుడు.

"ఆ సంగతి తెలిస్తే యింక కావలసిందేముంది? అది తెలుసుకునేందుకే గదా, నేను యింత కాలంగా ఆ బ్రహ్మదండిగాణ్ణి సేవిస్తున్నాను," అన్నాడు జయమల్లు.

ఆ మాటలతో కేశవుడికి గురుశిష్యుల మధ్యవున్న వైరానికి కారణం ఏమిటో అర్థమయిపోయింది. ఆ రాకాసిలోయలో వున్న నిధులో లేక...వాళ్ళ ఆస్తికలో సంపాయించుకునేందుకు తను వాళ్ళకు సాయపడాలన్న మాట!





జయమల్లు పై బట్టతో ఒంటిని శుభ్రంగా తుడుచుకుని, కేశవుడికేసి తిరిగి, "ఊఁ త్వరగా కానీయ్, బయలుదేరుదాం," అన్నాడు. కేశవుడుకూడా అదరాబాదరా ఒళ్ళు తుడుచుకుని, విల్లంబులు తీసుకుని బయలుదేరాడు. జయమల్లు రెండడుగులు వేసి చప్పున ఆగిపోయి, "పాపం, ఆ ఏనుగులు గొంతెండి చస్తే, మనకు ఏం వస్తుంది!" అంటూ వెనుదిరిగి ఏదో మంత్రం చదివి, "ఏయ్, గజరాజులారా, యిక మీరు కొలనులో దిగ వచ్చు," అంటూ అరిచాడు.

ఎవరో ఆజ్ఞ యిచ్చినట్టుగా ఏనుగులు గుంపుగా ముందుకు కదిలి కొలనులోకి దూకినై. జయమల్లు అక్కడవున్న ఒక చిన్నరాతిని చేతిలోకి తీసుకుని, మచ్చల సింహానికేసి విసురుతూ, "ఇక నువ్వుకూడా నీ కంఠశోష ప్రారంభించు," అని అరిచాడు. సింహం ఎగిరి రాతిమీద నిలబడి చెవులు దిబ్బళ్ళుపడేలా గర్జించటం మొదలుపెట్టింది. ఆ గర్జన వింటూనే కొలనులోని ఏనుగులు తొండాలెత్తి పెద్దగా ఘీంకారనాదం చేసినై.

"నేను కొలనుకు స్నానానికి వచ్చిన రోజల్లా యిదే వరస. ఆ ఏనుగులూ, ఈ సింహం యిలాగే గంటల తరబడి కవ్వించుకుని, చివరకు వేటిదారిన అవి పోతవి," అన్నాడు జయమల్లు ఎంతో తృప్తిగా.

జయమల్లు ధోరణి కేశవుడికి చిరాకు తెప్పించింది. తనకు యిక కొద్ది గంటల్లో మాంత్రికుడివల్ల ప్రమాదం రాబోతున్నది. జయమల్లు కేమో చీమ కుట్టినట్టయినాలేదు.

"మన యిద్దరం ఈనాటి నుంచీ స్నేహితులమని చెప్పావు. అయినా, నాకు కలగనున్న ప్రమాదాన్నుంచి కాపాడేందుకు నువ్వు ఎలాంటి ప్రయత్నం చేస్తున్నట్టు లేదు," అన్నాడు కేశవుడు.

జయమల్లు తల ఎత్తి కొండ పైభాగానికేసి చూశాడు. అక్కడ ఒక పెద్ద బండ

రాయి వాసుకుని బ్రహ్మదండి మాంత్రికుడు తమ కేసే చూస్తూండటం అతడికి కనిపించింది. వెంటనే జయమల్లు కేశవుణ్ణి హెచ్చరిస్తూ, "నువ్వెంత పెద్దగా మాట్లాడకు. వాడివి పాము చెవులు. నీకు ప్రమాదం కలగకుండా కాపాడటం నాకూ ఎంతో అవసరం. రాకాసిలోయలో ప్రవేశించేందుకు అడ్డపడటే బ్రహ్మదండిగాడితోపాటు, నేనూ ఈ రోజునే తెలుసుకున్నాను. నీ భుజం మీదవున్న మచ్చ—పడగ విప్పిన పాము చూసిం తరవాత వాడు ఎంత సంతోష పడ్డాడో చూశావు గదా? ఈ రాత్రి నీకు ఏదో శక్తిని ఆవహింపచేసి, ఆ రాకాసి లోయకు వెళ్ళదారి, అక్కడ నిధినిక్షేపాల సంగతి నీ చేత చెప్పిస్తాడు. ఆ వివరాలేవో తెలిసిం తరవాత మనం వాణ్ణి మరోలోకానికి పంపిద్దాం, భయపడకు!" అన్నాడు.

"మనకంటె ముందే వాడు జాగ్రత్త పడి, మననే వాడు పరలోకయాత్ర చేయిస్తే? ఆ సంగతాలోచించావా?" అన్నాడు కేశవుడు అనుమానంగా.

"వాడా పనిచేయలేడు. వాణ్ణిప్పుడు ధనపిశాచి, కీర్తిభూతం పట్టి పీడిస్తున్నవి. అందువల్లే వాడిలో ఇంగితజ్ఞానం లోపించింది. అలా కాకపోతే, వాడు నన్నూ మన యిద్దర్నీ యిలా కలిసి కట్టుగా తిరగనిచ్చే వాడు కాడు," అన్నాడు జయమల్లు.

కొండమీద రాతి పక్కన నిలబడి వాళ్ళకేసే చూస్తున్న బ్రహ్మదండి మాంత్రికుడి పెదాలమీద చిరునవ్వు కదుల్లాడింది. వాడు లేచి, "రవ్వా జయమల్లా, కేశవా! వచ్చేప్పుడు యిన్ని ఎండు చిరిగెనపుల్లలూ, యిన్ని వెలగపళ్ళలూ — సమపాళ్ళలో పట్టుకు రండి. కాలభైరవుడు ఆకలితో నకనకలాడిపోతున్నాడు. పాపం, వెయ్యి సంవత్సరాల కొక్కసారి మాత్రమే ఈ ఉపాసకుల చూడలమ్మకి ఆకలివేస్తుంది!" అని కేకపెట్టాడు. —(ఇంకా వుంది)



# తెలుసుకోగూడని సత్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుమీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఏదైనా సత్యాన్ని తెలుసుకో గోరి ఈ అపరాత్రి సమయంలో ఇలా శ్రమపడుతున్నావా? అయిన పక్షంలో నీ ప్రయత్నం మానటం మంచిది. ఎందుకంటే ఒక్కొక్కప్పుడు సత్యాన్ని తెలుసుకోవటంకూడా చాలా అపాయకరం. ఈ విషయం నిరూపించటానికి నీకు రసలుబ్ధ మహారాజు కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం రసలుబ్ధ మహారాజని ఉండేవాడు. ఆయనకు ముగ్గురు భార్యలు. ముగ్గురుకూడా అసమాన సౌందర్యవతులు. ఏ ఒకరిని చూసినా ప్రపంచంలో అంత సౌందర్యవతి మరొకతె ఉండదనిపించేది. అటువంటి అపురూపలావణ్యవతులు

## బేతాళ కథలు





ముగ్గురు తనకు భార్యలయినందుకు రాజు సంతోషంతో పొంగిపోయేవాడు.

ఒక వేసవికాలపు పండువెన్నెల రాత్రి రాజు తన ముగ్గురు భార్యలతోనూ మిద్దె మీద చల్లగాలికి శయనించి ఉండగా ఒక రాత్రివేళ రాజుకు మెలకువ వచ్చింది. పిండి ఆరబోసినట్టున్న వెన్నెలలో నిద్రించే తన భార్యలు అప్సరసలను మించి ఉన్నట్టు రాజుకు తోచింది.

అంతలోనే ఆయన కొక సందేహం వచ్చింది। తన భార్యలు ముగ్గురూ లోకంలో అందరు స్త్రీలకన్నా చక్కనివారే। కాని వారిలో ఎవతె ఎక్కువ చక్కనిది?

ఈ సందేహం తీర్చుకునేటందుకై రాజు ఒక్కొక్క భార్యనే మళ్ళీమళ్ళీ చూశాడు. ఎంతసేపు చూసినా ఆయనకు వారి సౌందర్యంలో కుంచెంకూడా తారతమ్యం తెలియలేదు. ఆయన అనుమానం తీరనేలేదు. అంతకంతకూ రాజుకు ఈ నిజం తెలుసుకోవాలన్న ఆరాటం హెచ్చిపోయింది. ఆయన ఆ రాత్రి మరి నిద్రపోనేలేదు.

తెల్లవారగానే రాజు నిత్యకృత్యాలు తీర్చుకుని సభాభవనానికి వెళ్ళాడు. ఆయన మంత్రి నయనేత్రి అనేవాడు ఆయనను చూస్తూనే, "మహారాజా, తమ కళ్ళు నిద్ర లేనట్టుగా ఎర్రగా ఉన్నాయి. కారణమేమిటి?" అని అడిగాడు.

"మంత్రీ, ఒక్క సందేహం నా తలలో ప్రవేశించి తెల్లవార్లూ నాకు నిద్రలేకుండా చేసింది. ఇప్పటికీ ఆ సందేహం తీరనే లేదు. అదేమిటంటే—నా ముగ్గురు భార్యలలోనూ ఎక్కువ అందగత్తె ఎవరు? ఎంత ఆలోచించినా సమాధానం దొరకటంలేదు," అన్నాడు రాజు.

"మహారాజా, దానినిబట్టే ముగ్గురు రాణులూ సమాన సౌందర్యవతులనీ, హెచ్చుతగ్గులకూ, ఓర్వలేనితనాలకూ అవకాశం లేదని తెలియటం లేదా? మీరా

విషయమై మనసును బాధ పడనీకండి," అన్నాడు మంత్రి నయనేత్రి.

"అలా కాదు, మంత్రీ. నాకు ఈ విషయం నిజం తెలిసి తీరాలి. లేకపోతే నాకు మనశ్శాంతి ఉండదు," అన్నాడు రాజు.

రాజుగారి మనస్సును ఈ పెడమార్గం నుంచి మళ్ళించటం సాధ్యంకాదని నయనేత్రి గ్రహించాడు. ఆయన రాజుతో, "మహారాజా, మన నగరానికి ఒక బ్రాహ్మణ యువకుడు వచ్చాడు. అతడి పేరు కాంతిగ్రహుడు. స్త్రీ సౌందర్యాన్ని అంచనా కట్టటంలో అతడికి సమానులైనవారు మూడు లోకాలలోనూ లేరని ప్రతీతి. అతణ్ణి పిలిపించి ముగ్గురు రాణులనూ చూపండి. ముగ్గురిలోనూ ఎవరి సౌందర్యం ఉత్కృష్టమైనదో అతను తూచినట్టు చెప్పగలుగుతాడు," అన్నాడు.

రాజు ఈ సలహాకు ఎంతో సంతోషించి కాంతిగ్రహుణ్ణి పిలిపించి ఒక గదిలో అతనితో మాట్లాడుతూ కూచున్నాడు. ఆ సమయంలో రాజుగారు ముందుగానే చేసిన ఏర్పాటు ప్రకారం, ముగ్గురు రాణులూ, ఒకరి తరవాత ఒకరుగా, రాజుగారు కూచున్న గది కుండా నడిచి వెళ్ళారు.

మొదటి రాణిని చూసినప్పుడు కాంతిగ్రహుడు కొయ్యబారిపోయినట్టుగా అయి



పోయాడు. రెండవ రాణి కనిపించగానే అతని శరీరం కొద్దిగా జలదరించింది. మూడవ రాణి అటుగా వెళ్ళినప్పుడు ఆ బ్రాహ్మణ యువకుడి ముఖం వివర్ణమయింది.

ముగ్గురూ వెళ్ళిపోయాక రాజు కాంతిగ్రహుడితో, "బ్రాహ్మణా, నీవు సౌందర్య నిపుణుడవని విన్నాను. ఇప్పుడు ఈ గదికుండా నడిచి వెళ్ళిన ముగ్గురు రాణులనూ చూశావుగదా? వారిలో ఎవరి అందం హెచ్చో చెప్పు చూతాం!" అన్నాడు.

కాంతిగ్రహుడు తనలోతాను ఈ విధంగా వితర్కించుకున్నాడు: రాజుగారి అభిమాన భార్య ఎవరో తెలుసుకోకుండానే ఎవరు అందంలో ఎక్కువైనది చెప్పటం క్షేమం కాదు. తన అభిమాన భార్య అందరికన్నా అందగత్తె కాని పక్షంలో రాజుగారికి తప్పక ఆగ్రహం కలుగుతుంది. అదిగాక, ముగ్గురు రాణులలో ఎవరు ఎక్కువ అందంగా ఉన్నారని చెప్పినా మిగిలిన ఇద్దరికి తన మీద కోపం వచ్చి ఏదో విధంగా తన ప్రాణాలు తీయిస్తారు.

ఇలా ఆలోచించుకున్నవాడై కాంతిగ్రహుడు, రాజుగారి ప్రశ్నకు సమాధానం చెప్పగలిగి ఉండికూడా, "మహారాజా, ఆలోచించుకోవటానికి నాకు రేపటిదాకా



వ్యవధి ఇవ్వండి," అని వినయంగా అడిగాడు. రాజు ఇందుకు సమ్మతించి కాంతి గ్రహుణ్ణి పంపేశాడు.

ఆ బ్రాహ్మణ యువకుడు వెళ్ళిపోయాక నయనేత్రి రాజుతో, "మహారాజా, ఈ యువకుడు మీ రడిగిన ప్రశ్నకు సమాధానం తెలిసికూడా ఆలోచించటానికి రేపటి దాకా వ్యవధి అడిగాడు. అతను నిజం చెప్పటానికి భయపడుతున్నాడనీ, ఈ రాత్రే అతను నగరం విడిచి పారిపోతాడనీ నా నమ్మకం," అన్నాడు.

ఈ మాట విని రాజు ఆరాటపడి, "ఆ బ్రాహ్మణ యువకుడికి తెలిసిన విషయం మనం గ్రహించటానికి ఏమిటి ఉపాయం?" అని అడిగాడు.

"మహారాజా, అందుకు తగిన ఉపాయం నేను ఆలోచిస్తాను. మీరు విచారించకండి," అని నయనేత్రి ఒక పథకంవేశాడు. ఆయన ఎత్తుపారింది. కాంతిగ్రహుడి అంచనా ప్రకారం ముగ్గురు రాణులలోనూ ఉత్తమ సౌందర్యవతి ఎవరో రాజుకు తెలిసిపోయింది. ఆయన ఆ రాణిపట్ల ఎక్కువ ప్రేమగా ఉంటూ మిగిలిన ఇద్దరు భార్యలను అలక్ష్యంగా చూడసాగాడు. అది గమనించి ఆ ఇద్దరు రాణులూ మూడవ రాణికి మందుపెట్టి చంపించారు. ఈ నేరం



బయట పడింది. రాజుగారు ఆగ్రహావేశుడై తన ఇద్దరు రాణులకూ మరణదండన విధించాడు.

ఈ విధంగా రాజుగారి సంశయం అప్సరసల్లాంటి అయిన ముగ్గురు రాణులనూ నిర్మూలించేసింది.

జ్ఞాని అయిన మంత్రి నయనేత్రి సలహా వినక రాజు గోతిలో పడ్డాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కాంతిగ్రహుడికి తెలిసిన సత్యాన్ని బయటపెట్టడానికి నయనేత్రి ఏమి ఉపాయం చేసి ఉంటాడు? అది సాధ్యమయ్యే పనా? నయనేత్రి వేసిన పథకం ఎలాటిదై ఉంటుంది? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నయనేత్రి కాంతిగ్రహుడి మనోభావం తెలుసుకోవటం ఏమీ కష్టంకాదు. ఆ యువకుడు సౌందర్యనిపుణుడు. రాజు భార్యలు అపురూప సౌందర్యవతులు. వారు రాసినట్టుగా మూడు ప్రేమలేఖలు సృష్టించి, ముగ్గురూ అతన్ని ఒకే వేళకు వేరువేరు సంకేతస్థలాలకు రమ్మనట్టు ఆహ్వానాలు పంపితే, అతను మూడుచోట్లకూ ఒకేకాలంలో వెళ్ళలేడు గనక, తనకు అందరికన్న ఎక్కువ సౌందర్యవతి అనిపించిన రాణి రమ్మన్న చోటికే వెళతాడు. మంత్రి నియమించిన చారులు అతనివెంట రహస్యంగా ఉండి అతను ఎక్కడికి వెళ్ళినదీ తెలుసుకుని, ఆ సంగతి మంత్రికి చెబుతారు. ఆ ప్రదేశం ఏ రాణి పేర సృష్టించిన లేఖలో ఉండే సంకేత స్థలమో మంత్రికి తెలుసు గనక ఆమె మిగిలిన ఇద్దరికంటె సౌందర్యవతి అని తెలిసిపోతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)



# లక్ష్మీ కటాక్షం ★ [రామతీర్థ కథ]

ఒక రాజుగారి వద్ద ప్రధానామాత్యు డుండేవాడు. ఆయనకు లక్ష్మీదేవిని ప్రత్యక్షం చేసుకోవాలని గాఢమైన కోరిక కలిగింది. అందుకోసమై ఆయన ఎన్నో జపాలూ, తపాలూ చేశాడు. లక్ష్మీ సహస్రనామాలు నూరుసార్లు జపించాడు. లక్ష్మీదేవి ప్రత్యక్షం కాలేదు. విసుగెత్తేదాకా లక్ష్మీపూజ చేశాడు. ఆ దేవి కటాక్షించలేదు.

కాలక్రమాన ఆయనకు ఐహిక సుఖాల మీదనే విరక్తి కలిగింది. లక్ష్మిని ప్రత్యక్షం చేసుకోగలనన్న నమ్మకంకూడా పోయింది. ఆయన సన్యాసాశ్రమం స్వీకరించి, తపస్సు చేసుకోవటానికి అరణ్యానికి బయలుదేరాడు.

తలవని తలంపుగా ఆయనకు దారిలో లక్ష్మీదేవి ప్రత్యక్షమై, "నన్ను ప్రత్యక్షం చేసుకోవటానికి నీవు చేసిన పూజలూ, అర్చనలూ చూసి నీ కోరిక తీర్చ వచ్చాను," అన్నది.

"వెళ్ళవమ్మా, వెళ్ళు. నా కోరికలన్నీ ఉడిగాయి. నే నిప్పుడు అన్నీ త్యజించిన సన్యాసిని. కోరినప్పుడు కనబడక అవసరం లేనప్పుడెందుకు కనిపిస్తున్నావు?" అన్నాడు సన్యాసి.

"నా దర్శనం కోసం యాచించినంత కాలమూ నీవు బిచ్చగాడివే. నేను బిచ్చగాళ్ళకు దర్శన మివ్వను. బిచ్చగాడి మనస్తత్వం నీలో లేకుండా పోయింది గనక నీ కిప్పుడు కనిపించాను," అన్నది లక్ష్మీదేవి.





# మంచి జయిస్తుంది

ఒక కొండ చరియ మీద ఒక కాపు నివసిస్తూ ఉండేవాడు. ఆయనకున్న ఆస్తి ఒక మేకల మంద. ఆయనకు ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ ఉండేవారు.

ఒకనాడు కాపు కుమార్తె కొండ శిఖరం మీద మేక పిల్లలను మేపుకుంటూ ఉండగా, గారడీ చేసినట్టుగా ఆకాశం నుంచి ఒక మబ్బులాటిది ఆమె ఉన్నచోట వాలి, అంతలోనే మళ్ళీ పైకి లేచిపోయింది. ఆ క్షణంలోనే ఆ పిల్ల మాయమైపోయింది. తరవాత ఎంత వెతికినా ఆమె జాడ దొరకనే లేదు.

ఒక సంవత్సరం గడిచింది. కాపు కూతురు మాయమైన రోజు మళ్ళీ వచ్చింది. కాపు పెద్ద కొడుకు తండ్రితో, "అమ్మాయి మాయమై నిన్నటితో ఏడాది నిండింది. దాని కోసం వెతకకుండా కూచోవటం నాకేమీ బాగాలేదు. నేను బయలుదేరి వెళ్ళి దాన్ని వెతికి తెస్తాను," అన్నాడు.

"నీవు వెళ్ళి అమ్మాయిని వెతుకుతాననటం నాకు సమ్మతమే గాని, నన్ను అనుమతి కోరకుండా నీ అంతట నీవే నిర్ణయానికి రావటం అంత మంచి లక్షణం కాదు," అన్నాడు తండ్రి.

పెద్ద కొడుకు నిర్లక్ష్యంగా తల ఎగరేసి తన తల్లితో, "అమ్మా నాకు మంచి రొట్టె కాల్చి పెట్టు, దారిలో తినటానికి," అన్నాడు.

తన పెద్దకొడుకు తండ్రి పట్ల వినయంగా ప్రవర్తించలేదన్నది తల్లిని బాధించింది. ఆమె వాడితో, "నాయనా, ఇష్టం లేకుండా పెద్దరొట్టె కాల్చనా? ఇష్టంతో చిన్నరొట్టె కాల్చనా?" అని అడిగింది.

"ఇష్టం లేకుండా అయినా సరే పెద్ద రొట్టె కాల్చు. అపేక్షతో కడుపు నిండుతుందా?" అన్నాడు పెద్దకొడుకు. వాడు తల్లి ఇచ్చిన పెద్దరొట్టె సంచిలో వేసుకుని, కాలి సత్తువకొద్దీ నడుస్తూ దుప్పులవనం

ఎల్. ముకుందరావు







చేరుకున్నాడు. వాడికి ఆకలి వేస్తున్నది. అందుచేత, ఒక చట్రాయి కనిపిస్తే దానిపై కూచుని, సంచిలో నుంచి రొట్టె పైకి తీసి తినబోయాడు.

అంతలోనే ఎక్కడినుంచో ఒక మాల కాకి రెక్కలు తపతప లాడించుకుంటూ వచ్చి, పెద్దవాడి సమీపంలో ఉన్న ఎత్తయిన కొనరాతిపై వాలి, రొట్టెను చూస్తూ, "కా, కా!" అని అరిచింది.

"పోవే, మాలకాకీ! అసలే నాకు చాలని రొట్టెలో నీకు వంతు కావాలా?" అంటూ పెద్దవాడు తన మానాన తాను రొట్టెను సాంతం తినేశాడు, ఒక చిన్న తుంపుకూడా వదలకుండా. తరవాత వాడు మళ్ళీ నడక సాగించి, చీకటి పడే వేళకు ఒక కొండ కొమ్ము ఎక్కి దిగే సరికి, ఎదురుగా ఒక కుటీరమూ, అందులో నుంచి వచ్చే దీపపు వెలుగూ కనిపించాయి.

ఆ రాత్రికి అక్కడ విశ్రాంతి తీసుకోవటానికి నిశ్చయించుకుని పెద్దవాడు ఇంటిని సమీపించాడు. ఆ ఇంటి యజమాని శత వృద్ధులాగా కనిపించాడు. ఆయన కాపు పెద్దకొడుకుకు ఆదరంతో స్వాగతం చెప్పి, భోజనం పెట్టి, "అబ్బాయీ, నా దగ్గిర కమతం ఉంటావా? నాకు మూడు మచ్చలావు లున్నాయి. వాటిని కాయటానికి మనిషి కావాలి," అన్నాడు.

"నేను మా చెల్లెల్ని వెతకటానికి బయలు దేరాననుకోండి. అయినా గిట్టుబాటు అయే పక్షంలో మీ ఆవులను కాయటానికి నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు పెద్దవాడు.

"ఆవులను కాయటంలో నేను చెప్పినట్టు నడుచుకుంటే నీకు ప్రతిఫలం బాగానే ముట్టజెప్పుతాను; ఆ విషయం నీకు సందేహం వద్దు. చూడూ, ఆవులను మేతకు తీసుకు వెళ్ళినప్పుడు వాటిని నీకు కావలిసినట్టు తోలక, అవి ఎటు వెళితే అటు వెళ్ళనివ్వాలి. అవి ఏ మేత మేస్తే ఆ మేత మేయ

ఇవ్వాలి, కాని నీవు వాటిని వదిలిపెట్టి ని దాటిన నీవు పోరాదు. అవి ఇల్లు బయలు దేరి తిరిగి ఇల్లు చేరేదాకా వాటి వెంటనే ఉండాలి. ఇందులో ఏ మాత్రం తేడావచ్చినా నేను సహించను," అన్నాడు వృద్ధుడు.

పెద్దవాడు ఈ నియమాలకు ఒప్పుకుని మర్నాడు ఉదయం ముసలివాడి మూడు ఆవులనూ వెంట బెట్టుకుని బయలుదేరాడు. అవి రెండు కొండలు దాటి ఒక లోయలోకి వెళ్ళి అక్కడ మేయ నారంభించాయి.

ఇక్కడ ఒక చిత్రం జరిగింది. ఉన్నట్టుండి ఆకాశం నుంచి రెండు కోళ్ళు లోయలో, పెద్దవాడికి అంతదూరంలో వాలాయి. వాటిలో ఒకటి బంగారు రంగు గల పుంజు, రెండవది వెండి రంగుగా ఉన్న పెట్ట. ఆ రెండు కోళ్ళనూ చూడ గానే పెద్దవాడి కళ్ళు కుట్టాయి. వాడు మేసే ఆవులను విడిచిపెట్టి ఆ కోళ్ళకేసి పరిగెత్తాడు. బంగారు కోడిపుంజు తోక ఈకలు మెరిసిబంగారు రంగులో మిలమిల లాడుతున్నాయి. పెద్దవాడి చేయి వాటిమీద పడిందోలేదో, మంత్రం పెట్టినట్టు రెండు కోళ్ళూ మాయమయాయి.

"ఇదంతా ఏదో ఇంద్రజాలం లాగుంది. ముసలివాడు చెప్పిన మాట వినక మాయ దారి కోళ్ళకోసం పరిగెత్తాను," అనుకుంటూ



వాడు ఆవులు మేసే చోటికి తిరిగివచ్చాడు. ఆ క్షణంలోనే మరొక వింత కనిపించింది. ఒక బంగారు కర్రా, ఒక వెండి కర్రా వాడి ముందుగా ఎగురుతూ పోతున్నాయి. భ్రమ అయి ఉంటుందనుకుని వాడు కళ్ళు నులుచుకుని మళ్ళీ చూశాడు. భ్రమ ఏమీ లేదు. నిజంగానే ఒకటి బంగారు కర్రా, ఇంకొకటి వెండి కర్రా. మళ్లీ వాడి కళ్ళు కుట్టాయి. ఆవుల గొడవ మరిచిపోయాడు. "ఆ రెండు కర్రలూ చిక్కించుకుంటే దరిద్రం శాశ్వతంగా తీరి పోతుంది," అను కుంటూ వాటి వెంట పడ్డాడు. కాని వాడు పది అంగలైనా వేశాడో లేదో, ఆ కర్రలు కూడా కోళ్ళజంటలాగే మాయ మయాయి. రెండోసారి మోసపోయి వాడు ఆవులున్న చోటికి వచ్చాడు. అవి మేత మేస్తూనే లోయ చివరకు వచ్చాయి. అక్కడ తలవని తలంపుగా వాడికొక అద్భుతమైన దృశ్యం కనపడింది. అక్కడ కొన్ని పళ్ల చెట్లున్నాయి. వాటినిండా పండిన పళ్ళున్నాయి. వాటి బరువుకు కొమ్మలు నేల నాసుతున్నాయి. ఆ పళ్ళను చూస్తుంటే వాడికి నోరూరింది. మళ్ళీ ఆవులను వదిలేసి, ఆ పళ్లు కోసుకుని, కడుపు ఉబ్బేసదాకా ఆత్రంగా తిని తిరిగి ఆవులు మేసే చోటికి వచ్చాడు. ఆ తరవాత అవి మేత చాలించి ఇంటి దారి పట్టాయి.





కాపు పెద్దకొడుకు వాటి వెంట తానుకూడా బయలుదేరి వెళ్ళాడు.

ముసలివాడు వాడితో, "ఈ ఆవులకు పాలు తీసి నీవు నేను చెప్పిన ప్రకారం వాటిని కాశావో లేదో చూస్తాను," అని మూడు ఆవులకూ పాలు తీశాడు. ఆ పాలు అతి పలచగానూ, నీరసంగానూ ఉన్నాయి.

"నమ్మక ద్రోహి! ఇదుగో నీకు ప్రతిఫలం," అంటూ ముసలివాడు ఆ పాలను కాపు కొడుకుపైన విసిరాడు. వెంటనే వాడు నిలుచున్న పాళంగా శిల అయిపోయాడు.

ఇంకొక ఏడాది గడిచింది. కాపు చిన్నకొడుకు తన తండ్రితో, "నాన్నా, అన్నయ్య మాయమైపోయి రెండేళ్లయింది. అన్న వెళ్లి ఏడాది వెళ్ళింది. ఇద్దరి జాడా లేదు. నేను వెళ్ళి వాళ్ళ విషయం ఆరా తీసి, వీలుంటే వాళ్ళను తీసుకురానా?" అని అడిగాడు.

"దానికేం, నాయనా? వెళ్ళి క్షేమంగా తిరిగిరా," అన్నాడు తండ్రి.

"దారిలో తినటానికి నాకొక రొట్టె కాల్చి ఇయ్యమ్మా?" అన్నాడు చిన్నవాడు తల్లితో.

"నాయనా, ఇష్టం లేకుండా పెద్దరొట్టె కాల్చనా? ఇష్టంతో చిన్నరొట్టె కాల్చనా?" అని తల్లి వాణ్ణి అడిగింది.

"చిన్నరొట్టె అయితే మటుకేం? ఇష్టం తోనే కాల్చమ్మా!" అన్నాడు చిన్నవాడు.

వాడు తల్లి కాల్చిన రొట్టె తీసుకుని బయలుదేరి, భోజనం వేళకు దుప్పులవనం చేరుకుని, అన్నలాగే చత్రాతిపై కూచుని రొట్టె తీశాడు. ఇంతలో మాలకాకి వచ్చి, "కా, కా!" అని అరిచింది.

"నీకూ ఆకలేస్తున్నదా? అమ్మ ఆపేక్షతో ఇచ్చిన రొట్టె కొంచెం తిన్నా నాకు కడుపు నిండుతుందిలే!" అంటూ చిన్నవాడు రొట్టెను రెండుగా విరిచి ఒక ముక్క కాకికి వేశాడు. అది ఆ రొట్టెను ముక్కున కరుచుకుని వనంలోకి ఎగిరిపోయింది. ఆ సాయంకాలానికి చిన్నవాడు ముసలి



వాడుండే ఇంటికి చేరాడు. పెద్దవాణ్ణి అడిగినట్టుగానే ముసలివాడు, చిన్నవాణ్ణికూడా తన మచ్చలావులను కాయమని అడిగాడు.

"నేను మా చెల్లెలిని, అన్ననూ వెతుకుతూ బయలుదేరాను. అయినా నీవు చూడబోతే పండు ముసలివి. కొండ ఎక్కి, దిగి ఆవులను మేపటం నీవల్ల ఏమవుతుంది? అందుచేత కొద్దికాలంపాటు నీ ఆవులను కాస్తాలే," అన్నాడు చిన్నవాడు. ముసలివాడు చిన్నవాడికికూడా ఆవులను కాయవలసిన పద్ధతి చెప్పి, తాను చెప్పినదానికి వ్యతిరేకంగా చెయ్యవద్దన్నాడు.

చిన్నవాడు లోయలో మూడావులనూ మేపే సమయంలో బంగారు పుంజూ, వెండి పెట్టా ఎక్కడినుంచో వచ్చి, వాడికి అంత దూరాన వాలాయి. వాడు వాటిని చూశాడు గాని ఆవులను వదిలేసి వాటి కోసం పరిగెత్తి పోలేదు. తరవాత వాడికి గంతే బంగారు కర్రా, వెండి కర్రా కనిపించాయి. వాటిని కూడా వాడు లక్ష్యపెట్టలేదు.

ఆవులు మేస్తూనే పళ్ల చెట్లున్న చోటికి వచ్చాయి. చిన్నవాడికి ఆ పళ్ళను చూస్తుంటే తినాలని తీవ్రమైన కోరిక కలిగింది. కాని ముసలివాడు తనను ఆవుల వెంటనే ఉండమని చెప్పటంవల్ల వాడికి ఆ పళ్లు కోసుకు తినే అవకాశం లేకపోయింది. ఎందుకంటే ఆవులు ఆగకుండా ముందుకు పోతున్నాయి. వాడు వాటి వెనకే నడిచాడు.

అకస్మాత్తుగా పొగచుట్టివేసింది. చెట్లు కాలుతున్న వాసన కొట్టింది. కొంతదూరం వెళ్ళేసరికి ఒక మైదానంలాటి ప్రదేశంలో ఉన్న దుబ్బులన్నీ అంటుకుని మండుతున్నాయి. ఆ మంటలను లక్ష్యపెట్టకుండా ఆవులు ఆ మండే దుబ్బులమధ్యగా నడిచాయి. గత్యంతరంలేక చిన్నవాడు వాటిని అనుసరించాడు.

అదృష్టవశాత్తూ ఆ మంటలు ఆవులకు గాని, చిన్నవాడికి గాని ఏమీ అపకారం

చెయ్యలేదు. ఆవులు ఆ మైదానాన్ని దాటి కొంతదూరం నడిచి ఒక వాగు వద్దకు వచ్చాయి. ఆ వాగు పొంగి, పొర్లి, ఉరకలు వేస్తూ ప్రవహిస్తున్నది. అయినా ఆవులు నిశ్చింతగా అందులోకి దిగి అడ్డంగా నడిచాయి.

చిన్నవాడుకూడా విధిలేక వాటి వెంట వాగులోకి దిగాడు.

ఆవులు వాగు దాటి కొత్తదారిన ఇంటికి తిరిగి వచ్చాయి. చిన్నవాడుకూడా వాటితో పాటు ఇల్లు చేరాడు. వాడు తాను చెప్పిన ప్రకారం ఆవులను కాశాడో లేదో తెలుసుకోవటానికి ముసలివాడు ఆవులకు పాలు తీశాడు. పాలు చిక్కగానూ, బలంగానూ వచ్చాయి. "నీవు నిజమైన కాపరివి. నేను చెప్పినట్టే చేశావు. నీ అన్నలాగా అలక్ష్యంగా కాసి ఉంటే నీ గతికూడా ఇలాగే అయి ఉండేది," అంటూ ముసలివాడు శిల అయిన కాపు పెద్దకొడుకును చూపించాడు.

"ఈ ముసలివాడు మంత్రగాడు లాగుంది. చెల్లెలినికూడా వీడే మాయం చేసి ఉంటాడు," అనుకున్నాడు చిన్నవాడు.

"నా మచ్చలావులను నేను చెప్పిన ప్రకారం కాసినందుకు బహుమానం ఇస్తాను, ఏం కోరతావో కోరుకో," అన్నాడు ముసలివాడు.



"అయ్యా, నాకున్నదల్లా ఒకటే కోరిక. శిలగా మారిన నా అన్నను మామూలు మనిషిని చెయ్యండి. చాతనయితే నా చెల్లెలు మళ్ళీ మాకు దక్కేటట్టు చెయ్యండి," అన్నాడు చిన్నవాడు.

ఈ కోరిక విని ముసలివాడు అసంతృప్తి పడ్డట్టుగా ముఖం చిట్లించి, "పెద్ద కోరిక కోరావు. అది తీరాలంటే, నేను మూడు పనులు చెబుతాను, ఆ మూడూ నువ్వు చెయ్యాలి," అన్నాడు.

"చెప్పండి," అన్నాడు చిన్నవాడు.

"ఆ కనిపించే ఎత్తయిన పర్వతం మీద ఒక ఆడ దుప్పి ఉన్నది. దాని పక్కల మచ్చలుంటాయి. దాని కాళ్ళు చువ్వల్లాగా ఉంటాయి. దాని కొమ్ములు అద్భుతమైనవి. అది వాయువేగంతో పరిగెత్తుతుంది. దానిని పట్టుకురావటం నీ మొదటిపని. ఈ సమీపంలోనే అగాధమైన సరస్సున్నది. అందులో ఆకుపచ్చని రంగుగల బాతున్నది. దాని మెడ పసుపు పచ్చగా ఉంటుంది. దానిని తీసుకురావటం నీ రెండవపని. కొండల మధ్య కోనేటి అడుగున ఒక బెల్ల చేప ఉన్నది. దాని పొట్ట తెలుపు, మొప్పలు ఎరుపు, తోక వెండిరంగుగా ఉంటుంది. ఆ చేపను తీసుకురావటం నీ మూడోపని," అన్నాడు ముసలివాడు.



చిన్నవాడు అప్పుడే బయలుదేరి దుప్పి కోసం పర్వతం ఎక్కసాగాడు. పర్వత శిఖరాన వాడికా దుప్పి పెద్ద పెద్ద కొమ్ములతో కనిపించింది. వాడు దాని కోసం పరిగెత్తాడు. అది వాడికన్న పదింతలు వేగంతో పరిగెత్తి కొండలన్ని తిప్పసాగింది.

"నా వెంట ఒక మంచి బాగిలం ఉంటే ఎంత బాగుండేది!" అని వాడు అనుకున్నాడు. ఆ క్షణంలోనే ఒక బాగిలం శరవేగంతో దుప్పికేసి దూకి, దాన్ని పడదోసింది. చిన్నవాడు దుప్పిని చిక్కించుకుని, దాన్ని భుజాన వేసుకుని సరస్సుకు బయలుదేరాడు. బాగిలం ఎటో వెళ్ళిపోయింది.

తనకు సగం రొట్టె ఇచ్చాడన్న కృతజ్ఞతతో మాలకాకి ఆ బాగిలాన్ని వాడికి సహాయం పంపింది.

చిన్నవాడు సరస్సు వద్దకు వచ్చేసరికి ఆకుపచ్చ బాతు ఆకాశంలో ఎగురుతూ కనిపించింది. అది తనకు చిక్కుట మెలాగా అని వాడు అనుకునేటంతలో మాలకాకి స్వయంగా వచ్చి బాతును పట్టుకుని తెచ్చి చిన్నవాడి కాళ్ల వద్ద పడవేసి తన దారిన తాను వెళ్ళిపోయింది.

ఇదేవిధంగా వాడు ఎర్రమొప్పల చేపను పట్టుకోవటానికి ఎక్కడినుంచో ఒక నీటి పిల్లి వచ్చి సహాయం చేసింది.

ఈ విధంగా కాపు చిన్నకొడుకు ముసలివాడు చెప్పిన మూడు పనులూ పూర్తి చేసి, ముసలివాడి మెప్పు పొందాడు.

"నాయనా, నువ్వు కేవలం నీ మంచితనంతోనే తలపెట్టిన కార్యం సాధించావు. నీ అన్నను మామూలు మనిషిని చేస్తాను. నీ చెల్లెల్ని మాయం చేసి తెచ్చినది నేనే. ఆమెనుకూడా నీకు అప్పగిస్తాను," అంటూ ముసలివాడు, కాపు పెద్దకొడుకునూ, కూతురిని చిన్నవాడి ముందుంచాడు.

చిన్నవాడు వాళ్ళిద్దరిని వెంట బెట్టుకుని ఇంటికిపోయి సుఖంగా ఉన్నాడు.





# దేవయాని కథ

శుక్రుడు భృగువంశంలో పుట్టినవాడు, విద్యావంతుడు, తపశ్శాలి. ఆయనను దైత్యులూ, దానవులూ తమ గురువుగా పెట్టుకున్నారు. వృషపర్వుడనే దానవేశ్వరుడి నగరంలో శుక్రాచార్యుడు తన కుమార్తె అయిన దేవయానితో నివాసం చేస్తూండేవాడు. తరుచు దేవదానవులకు యుద్ధాలు జరిగేవి. ఆ యుద్ధాలలో చని పోయిన దానవులను శుక్రాచార్యుడు బతికిస్తూ ఉండేవాడు. ఏమంటే, ఆయన వద్ద మృతసంజీవని అనే మంత్రం ఉండేది. అది చచ్చినవారిని బతికిస్తుంది.

దేవతలకు గురువు బృహస్పతి. ఆయనకు మృతసంజీవని తెలియదు. అందుచేత చచ్చిపోయిన దేవతలు బతికే అవకాశం లేకపోయేది. ఇది దేవతలకు పెద్ద సమస్య అయిపోయింది. వారు ఆలోచించి ఒక ఉపాయం చేశారు. బృహస్పతి కొడుకైన కచుడితో, "బాబూ, నీవు వెళ్ళి శుక్రాచార్యుడికి శిష్యత్వం చేసి ఎలాగైనా మృతసంజీవని విద్య సాధించుకు రా. శుక్రుడికి వినయ విధేయతలతో శుశ్రూష చేసి ఆయనను మెప్పించు. ఆయన కుమార్తె దేవయానినికూడా నీ సేవతో మెప్పించు. లేకపోతే కార్యభంగం కలగగలదు," అని చెప్పారు. కచుడు ఇందుకు సమ్మతించి వృషపర్వుడి నగరం వెళ్ళాడు. శుక్రాచార్యుణ్ణి చూసి, వినయంతో నమస్కరించి, తాను బృహస్పతి కుమారుణ్ణని, ఆయన వద్ద శిష్యత్వం చేయవచ్చానని చెప్పుకున్నాడు. దేవతల గురువుయొక్క కొడుకు తనను గురువుగా ఎన్నుకున్నందుకు శుక్రుడు చాలా సంతోషించాడు. కచుడు శుక్రాచార్యుడి ఇంట ఉండి తన గురువూ, ఆయన కుమార్తె దేవయానీకూడా మెచ్చుకునే విధంగా సేవలు చేశాడు.

పురాణ కథ





ఒకనాడు కచుడు తన గురువుగారి హోమధేనువులను మేపడానికి అరణ్యానికి తీసుకుపోయి, కొంతసేపు సమిధలు ఏరి, అలసిపోయి ఒక మర్రిచెట్టు నీడను కూచున్నాడు. అప్పుడు కొందరు దానవులు అటుగా వచ్చి, కచుణ్ణి చూసి, "ఎవరు నీవు?" అని అడిగారు.

"నేను బృహస్పతి కొడుకును. శుక్రాచార్యులవారి వద్ద శిష్యుడుగా ఉంటున్నాను," అని కచుడు వారితో అన్నాడు.

ఆ మాట విని దానవులకు మండిపోయింది. "వీడు మన గురువు వద్ద మృతసంజీవని సంపాదించాలని వచ్చి ఉంటాడు," అనుకుని, కచుణ్ణి చంపి, అతడి శరీరాన్ని తునకలుచేసి తోడేళ్ళకువేసి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

సాయంకాలమయింది. హోమధేనువులు అలవాటు చొప్పున ఇంటికి తిరిగి వచ్చాయి. కచుడి జాడలేదు. అతనిపైన అప్పటికే చాలా వ్యామోహం పెంచుకున్న దేవయాని తండ్రి వద్దకు వెళ్ళి, "నాన్నా, అగ్నిహోత్రాలవేళ దాటినా కచుడింకా ఇంటికి రాలేదు. ఏ మృగం వాతపడ్డాడో, రాక్షసుల పాల పడ్డాడో?" అని పెద్దగా శోకాలు పెట్టింది.

శుక్రుడు దివ్యదృష్టిచేత కచుడి చావు తెలుసుకుని మృతసంజీవని ప్రయోగించాడు. వెంటనే కచుడు బతికి, తోడేళ్ళ పొట్టలు చీల్చుకుని బయటికి వచ్చి ఇల్లు చేరుకున్నాడు. అతన్ని చూసి దేవయాని, ఇంత ఆలస్యమయిందేమని అడిగింది. కచుడు అరణ్యంలో తనను దానవులు చంపగా, మృతసంజీవని ప్రభావంతో బతికి వచ్చానని చెప్పాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు దేవయాని కచుణ్ణి పూలుకోసి తెమ్మని అడవికి పంపింది. అక్కడ దానవులు తటస్థపడి కచుణ్ణి మళ్ళీ చంపి, చూర్ణం

చేసి, సముద్రంలో కలిపేశారు. ఈసారి కూడా దేవయాని అతన్ని తండ్రి ద్వారా బతికించుకున్నది.

అయినా దానవులు కచుడిపైన పగ బట్టారు. అతను పూల కోసం అడవికి వచ్చి మూడోమారు తమకు దొరికినప్పుడు, వారు అతన్ని చంపి, కాల్చి బూడిద చేసి ఆ బూడిదను మద్యంలో కలిపి తెచ్చి, శుక్రాచార్యుడి చేత తాగించారు.

కచుడు ఎంతకూ ఇంటికి తిరిగి రాక పోయేసరికి, మళ్ళీ దానవులు అతన్ని చంపి ఉంటారని గ్రహించి దేవయాని పెద్ద పెట్టున శోకాలు ప్రారంభించింది.

శుక్రుడు కూతురితో, "ఇక నీవు కచుడి కోసం విచారించకు. దానవులు వాడిమీద పగ బట్టారు. తమ కోసం ఉపయోగపడే మృతసంజీవనితో వాడు బతకటం వారు అసలు సహించలేరు. అందుకే వాణ్ణి మళ్ళీ మళ్ళీ చంపుతున్నారు. వాడికి మంచి లోకాలు కలుగుగాక!" అన్నాడు.

కచుడు బతికి తీరాలని దేవయాని మంకు పట్టుపట్టింది. అతను ఒక్క క్షణం కనిపించకపోతే తన ప్రాణం కొట్టుకు పోతుందనీ, అతన్ని బతికించకపోతే తాను తిండి మాని చచ్చిపోతాననీ తండ్రిని బెదిరించింది.





"ఏం మూర్ఖత్వమే నీది! నేను వాణ్ణి ఎన్నిసార్లు బతికించినా దానవులు వాణ్ణి చంపి తీరుతారు. శిష్య వాత్సల్యం కొద్దీ నేను వాళ్ళను కొప్పడలేనైతిని!" అంటూ శుక్రుడు మృతసంజీవని ప్రయోగించాడు.

దాని ప్రభావంచేత కచుడికి ప్రాణాలు తిరిగి వచ్చాయి. అతను శుక్రాచార్యుడి పొట్టలోనుంచి, "అయ్యా, నేను మీ పొట్టలో ఉన్నాను. బయటికి వస్తే మీకు అపాయం. ఇప్పుడేది దారి?" అని కేకపెట్టాడు.

"నా పొట్ట చీల్చిగాని బయటికి రాలేవు. పొట్ట చీల్చుకుని నీవు బయటికి వస్తే నేను చావక తప్పదు. నీవు చస్తే దేవయానికి ఎంత బాధో నేను చచ్చినా దానికి అంతే బాధ. అందుచేత నీకు మృతసంజీవని ఉపదేశిస్తాను. దాని ప్రభావంతో నన్ను బతికించు," అన్నాడు శుక్రాచార్యుడు.

కచుడు మృతసంజీవని ఉపదేశం పొంది శుక్రాచార్యుడి పొట్ట చీల్చుకుని బయటికి వచ్చి తిరిగి ఆయనను బతికించాడు. ఇది జరిగాక శుక్రాచార్యుడు మద్య నిషేధం ఒక నియమంగా ప్రకటించాడు. మద్యపానం బ్రహ్మహత్యతో సమానమన్న నియమాన్ని మునులూ, దేవతలూకూడా అంగీకరించాలని ఆయన కోరాడు.

మొత్తంమీద కచుడు వచ్చినపని అయిపోయింది. అతను మరికొంతకాలం ఉండి స్వస్థలానికి ప్రయాణం కట్టాడు. అప్పుడు దేవయాని అతనితో, "నా మనసంతా నీ మీదనే పెట్టుకుని ఉన్నాను. నిన్ను దానవులు చంపినప్పుడల్లా బతికించుకున్నాను. అందుచేత నీవు నన్ను తప్పక పెళ్ళిచేసుకో," అన్నది.

"అమ్మా, నీవు గురుపుత్రివి. తోబుట్టువు లాటిదానివి. ఇలా మాట్లాడరాదు," అన్నాడు కచుడు. దేవయానికి మండిపోయి, "నా తండ్రి నీకిచ్చిన సంజీవనిమంత్రం నీకు ఫలించకుండుగాక!" అని శపించింది.



"నిన్ను బ్రాహ్మణుడెవడూ పెండ్లాడ కుండుగాక!" అని కచుడు దేవయానికి ఎదురు శాపం ఇచ్చి స్వర్గానికి తిరిగి వెళ్లాడు. అతను మృతసంజీవని విద్యను దేవతలకు చెప్పాడు. అదిమొదలు దేవతలు కూడా తమలో చచ్చినవారిని బతికించు కుంటూ వచ్చారు.

వృషపర్వుడికి శర్మిష్ఠ అని ఒక కూతు రున్నది. ఆమె వెయ్యిమంది చెలికత్తెలనూ, దేవయానిని వెంటబెట్టుకుని ఒకనాడు వన విహారానికి బయలుదేరింది. అక్కడ వారు ఒక మడుగులో స్నానం చెయ్యాలను కున్నారు. తమ తమ చీరలను విప్పి గట్టున



పెట్టి మడుగులోకి దిగారు. వారు జలక్రీడ లాడి గట్టుమీదికి వచ్చేలోపల గాలికి బట్ట లన్నీ కలిసిపోయాయి. ఒకరికన్న ఒకరు ముందుగా బట్టలను కట్టుకోవాలని పోటీలు పడటంలో శర్మిష్ఠ దేవయాని చీర కట్టును న్నది. దేవయానికి శర్మిష్ఠ చీర మిగిలింది.

"ఓసి రాకసి! నేను బ్రాహ్మణ స్త్రీని, మీ గురువుగారి కుమార్తెను, నీ చీర నేనెలా కట్టుకుంటాను? నా చీర నీవెందుకు కట్టావు?" అని దేవయాని శర్మిష్ఠపై పోట్లా టకు వచ్చింది.

"ఓసి బిచ్చగత్తె! మీ తండ్రి మా తండ్రి ఇచ్చినది పుచ్చుకుని బతుకుతున్నాడు. దీనికే ఇంత గర్వమా? నా చీర నీవెందుకు కట్టుకోవు?" అంటూ శర్మిష్ఠ దేవయానిని సమీపంలో ఉండే బావిలోకి తోసి తన చెలి కత్తెలతో సహా ఇంటికి వెళ్ళిపోయింది.

శర్మిష్ఠ అనుకున్నట్టు దేవయాని బావిలో పడి చావలేదు. ఆ సమయంలోనే చంద్ర వంశపు రాజైన యయాతి వేటకై ఆ ప్రాంతా లకు వచ్చి, దాహం కావటంచేత నీటికోసం బావి వద్దకు వెళ్ళి లోపలికి చూసేసరికి ఆయనకు దేవయాని కనబడింది. ఆయన ఆమె కుడిచేతిని తన కుడిచేత బట్టి పైకి లాగి, వెళ్ళివస్తానని చెప్పి తన నగరానికి

వెళ్ళిపోయాడు. అంతలోనే ఘూర్ణిక అనే పరిచారిక అటుగా వచ్చింది. దేవయాని దానితో జరిగిన సంగతంతా చెప్పి, "నీవు మా నాన్నతో నేనిక్కడ ఉన్నానని, నేను వృషపర్వుడి నగరంలో అడుగు పెట్టనని చెప్పు." అని పంపింది.

త్వరలోనే శుక్రుడు ఆదుర్దాగా తన కుమార్తె ఉన్నచోటికి వచ్చి, "అమ్మా, నీవు శర్మిష్ఠను ఏమన్నావేమిటి? అట్టి పుణ్యానికి నీకింత ఘోరం ఎందుకు చేస్తుంది?" అని అడిగాడు.

"నాన్నా, శర్మిష్ఠ నన్ను బిచ్చగాడి కూతురని నిందించింది. ఆ మాట నిజమైతే నేనిప్పుడే వెళ్ళి దాని కాళ్ళు పట్టుకుంటాను," అన్నది దేవయాని.

"అమ్మా, నీవు ఎవరి కూతురవో లోకమంతా ఎరుగు. వృషపర్వుడే ఎరుగు. కాని మనకు క్రోధం తగదు. శర్మిష్ఠ రాజు కూతురు, పైపెచ్చు అజ్ఞానురాలు. దాని మాటలు పట్టించుకోక నా వెంట రా, పోదాం," అని శుక్రాచార్యుడు అన్నాడు.

"ఛీ, ఛీ! నేనంటే అంత తేలిక భావం గల దాని దగ్గిర ఉండటంకన్న చావటం మేలు. నేను మాత్రం ఆ నగరానికి రాను. ఇంకెక్కడికైనా పోతాను," అన్నది దేవయాని.



"తల్లీ, నాకు నీవు తప్ప ఇంకెవరున్నారు? పోతే ఇద్దరమూ కలిసే పోదాం పద," అని శుక్రుడన్నాడు.

ఈలోపుగా వృషపర్వుడికి జరిగినదంతా తెలిసింది. ఆయన స్వయంగా తండ్రి కూతుళ్ళున్న చోటికి వచ్చి, "మీరిద్దరూ ఈ అడవిలో ఉన్నారేమిటి? పురానికి పోదాం పదండి," అన్నాడు.

ఆయనతో శుక్రుడు, "రాజా, మీ రాక్షస చర్యలు నాకేమీ నచ్చలేదు. నా శిష్యుడైన కచుణ్ణి మీ మనుషులు చంపారు. ఇప్పుడు మీ కూతురు శర్మిష్ఠ నా కూతురిని బావిలో తోసి వెళ్ళిపోయింది. నేను మీకు ఎంత మంచి చేసినా మీవల్ల నాకు కీడే కలుగుతున్నది," అన్నాడు.

వృషపర్వుడీ మాటకు చాలా నొచ్చుకుని, "అయ్యా, మీరు మాకు ప్రాణదానం చేశారు. మేమూ, మా సంపదలూ, సమస్తమూ మీవి కావా? మమ్ము అనుగ్రహించండి," అన్నాడు.

"నామాట ఏమైనా, నా కూతురిని సమాధానపరుచు," అన్నాడు శుక్రాచార్యుడు.

"అమ్మా, నీకేం కావాలో చెప్పు. నీ ఇష్టం వచ్చినట్టు చేస్తాను. మా మీద ఆగ్రహించకు," అని వృషపర్వుడు దేవయానిని బతిమాలుకున్నాడు.





"నేను పెళ్ళి చేసుకుని కాపరానికి వెళ్ళేటప్పుడు నా వెంట వెయ్యిమంది దాసీలలో ఒకతెగా శర్మిష్ఠను పంపండి. ఇదే నా కోరిక," అన్నది దేవయాని.

వృషపర్వుడు అప్పటికప్పుడే శర్మిష్ఠను అక్కడికి పిలిపించి ఆమెకు దేవయాని కోరికను తెలిపాడు. శర్మిష్ఠ అంతా విని, "దేవయానీ, నీవు కాపురానికి వెళ్ళేటప్పుడు నా వెయ్యిమంది దాసీలతో నేనుకూడా వచ్చి నీకు సేవచేస్తాను," అన్నది.

దేవయాని ఎత్తి పొడుపుగా, "నువ్వు బిచ్చగాడికూతురికి దాసిగా ఉండగలవా?" అని అడిగింది.

ఈ మాట శూలంలాగా తగిలినప్పటికీ శర్మిష్ఠ దానవుల క్షేమంకోరి సహించి ఊరుకున్నది. దేవయాని వృషపర్వుడి పురానికి తిరిగి వచ్చి శర్మిష్ఠచేత పరిచర్యలు చేయించుకో నారంభించింది.

ఒకనాడు దేవయానీ, శర్మిష్ఠా, వెయ్యిమంది దాసీలూ, మరి వెయ్యిమంది పరిచారికలూ వనవిహారం కోసం పూర్వం వెళ్ళిన స్థలానికే వెళ్ళారు. దేవయాని ఒక చోట కూచుని రెండువేలమందిచేతా పరిచర్యలు చేయించుకుంటూండగా మళ్ళీ యయాతి అక్కడికి వచ్చాడు. చుక్కలలో చంద్రుల లాగా ప్రకాశిస్తున్న దేవయానినీ, శర్మిష్ఠనూ

చూసి, "మీరెవరు?" అని అడిగాడు. దేవయాని ఆయనతో తాను దానవ గురువైన శుక్రాచార్యుల కుమార్తెనని, శర్మిష్ఠ దానవ రాజైన వృషపర్వుడి కూతురని, ఒకనాడామె తనను బావిలో తోయటం మూలాన తన కిప్పుడు దాసి అయిందని చెప్పి, "రాజా, ఆనాడు బావిలోనుంచి నన్ను పైకి లాగటానికి నా చెయ్యి పట్టుకున్నావు. అది మన పాణిగ్రహణం. నేను నిన్ను తప్ప మరొకరిని పెళ్ళాడటం భావ్యం కాదు. అందుచేత నన్ను పెళ్ళాడు," అన్నది.

యయాతి ఆమెతో, "నేను క్షత్రియుణ్ణి. నహుషుడి కొడుకును. క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను వివాహమాడటానికి ధర్మం ఒప్పదు," అన్నాడు.

"మా నాన్నకు ధర్మాన్ని శాసించే శక్తి ఉన్నది. మన ఇద్దరి వివాహమూ సక్రమమైనదని ఆయన చేతనే ఒప్పిస్తాను," అంటూ ఒక పరిచారికను పంపి శుక్రుణ్ణి పిలిపించింది.

శుక్రుడు వచ్చి దేవయాని చెప్పినదంతా విని యయాతితో, "నీవు నా కుమార్తెను తప్పక పెళ్ళాడవచ్చు. అందువల్ల నీకేమీ దోషం రాకుండా నేను వరం ఇచ్చేశాను. దేవయాని వెంట ఈ రెండువేల దాసులనూ తీసుకుపో. ఈ శర్మిష్ఠకు నీవు అన్న వస్త్రాదు



అన్నీ ఏర్పాటు చెయ్యగాని, అంతకుమించి దీనితో ఏలాటి సంబంధమూ పెట్టుకోకు. ఇది నా ఆజ్ఞ," అన్నాడు.

యయాతి దేవయానిని పెళ్ళాడి, మామ గారూ, ఇతర దానవులూ ఇచ్చిన కానుక అన్నీ పుచ్చుకుని, భార్యతోనూ, శర్మిష్ఠ తోనూ, రెండువేలమంది పరిచారికలతోనూ తన పురానికి వెళ్ళిపోయాడు. ఆయన దేవ యానికి ఒక ఇల్లు కట్టించి, ఆమె కోరికపై శర్మిష్ఠకు మరొక ఇల్లు అశోకవనం చెంత కట్టించాడు. కాలక్రమాన దేవయాని యయాతికి యదువూ, తుర్వసుడూ అనే కొడుకులను కన్నది.

ఈలోపల శర్మిష్ఠ తన ఒంటరి జీవితం తలుచుకుని కుమిలిపోయింది. దేవయాని వరించినట్టే తానుకూడా యయాతిని వరించ డానికి నిశ్చయించింది. ఒకనాడు యయాతి అశోకవనంలో ఒంటరిగా తిరుగుతూండగా శర్మిష్ఠ ఆయన వద్దకు పోయి తన మనసులో మాట చెప్పింది. యయాతి శుక్రాచార్యుల ఆజ్ఞ మీరటానికి భయపడికూడా శర్మిష్ఠ కోరిక తోసెయ్యలేక ఆమెను రహస్యంగా పెళ్ళాడాడు. వారికి ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అని ముగ్గురు కొడుకులు పుట్టారు.

శర్మిష్ఠకు కొడుకులు కలిగారని తెలిసి దేవయాని ఆమెను, "కన్యవుగదా నీకి



పిల్లలు ఎలా పుట్టారు?" అని అడిగింది. శర్మిష్ఠ సిగ్గు పడుతూ, "ఒక ఋషి అనుగ్రహంవల్ల కలిగారు," అని చెప్పింది. కాని శర్మిష్ఠ కన్నపిల్లలలో తన భర్త అయిన యయాతి పోలిక ఉండటం గమనించి, నిజం తెలుసుకుని, భర్తతో పోట్లాడి, ఆమె తన తండ్రి అయిన శుక్రాచార్యుడి వద్దకు బయలుదేరింది.

యయాతి భయపడుతూ ఆమె వెనకనే బయలుదేరాడు.

దేవయాని చెప్పినది అంతా విని శుక్రాచార్యుడు యయాతిపై మండిపడి ముసలివాడివి కమ్మని శపించాడు. యయాతి ఆయన కాళ్ళపై పడి, "నేను దేవయానితో ఇంకా ఎంతో కాలం సుఖపడాలను కున్నాను. దయఉంచి శాపం ఉపసంహరించండి," అని వేడుకున్నాడు.

"నా శాపం తగిలే తీరుతుంది. కాని ఎవరైనా యువ్వనుడు నీ వార్ధక్యం తీసుకుంటే నీకు యువ్వనం వచ్చేటట్టు అనుగ్రహిస్తున్నాను," అన్నాడు శుక్రుడు.

యయాతి దేవయానికి ఇద్దరు కొడుకులనూ, శర్మిష్ఠకు ముగ్గురు కొడుకులనూ కన్నాడు. అందుచేత ఆయన వారిని ఒక్కొక్కరిని పిలిచి, "నా వార్ధక్యం తీసుకుని నీ యౌవనం నా కివ్వు," అని అడిగాడు. ఇందుకు దేవయాని కొడుకులు సమ్మతించలేదు, శర్మిష్ఠ కొడుకులలోకూడా పెద్దవాళ్ళిద్దరూ సమ్మతించలేదు; ఆఖరు వాడు పూరుడు మాత్రం సమ్మతించాడు.

పూరుడి యౌవనంతో యయాతి చాలా కాలం భోగాలన్నీ అనుభవించి, చివరకు వాడి యౌవనం వాడికి తిరిగి ఇస్తూ, తన రాజ్యం వాడికి ఒక్కడికే ఇచ్చి చనిపోయాడు.

దేవయాని ఎన్ని అవస్థలు పడినా, చివరకు యయాతికి వారసుడు శర్మిష్ఠ కొడుకే అయాడు.





మన పూర్వీకులు ఉత్తర ధృవప్రాంతంలో ఉండేవారట. అక్కడ ఉత్తరాయణం ఆరు నెలలూ పగలు. దక్షిణాయనం ఆరు నెలలూ రాత్రి. అదే దీర్ఘరాత్రి. ఆ దీర్ఘరాత్రిలో అక్కడివారు దీపాల సహాయం లేకుండా ఏ పనీ చేసుకోలేరు. దీర్ఘరాత్రి ఆరంభమే దీపావళి పండుగ అనీ, కార్తిక దీపాలు పెట్టేదికూడా అక్కడి సంప్రదాయమేనని కొందరంటారు.

చనిపోయినవారు నరకంగుండా పితృలోకానికి పోతారట. నరకం అంధకారమయంగా ఉంటుంది గనక వారికి దారి కనిపించడానికీ, పితృలోకాధిపతి అయిన యముణ్ణి ఆరాధించడానికీ మనం దీపావళి చేసుకుంటామని కొందరి నమ్మకం.

బలిచక్రవర్తి బలవంతుడై స్వర్గాన్ని ఆక్రమించుకున్నప్పుడు మహావిష్ణువు వామన రూపుడై వెళ్లి, మూడడుగులు దాన మడిగి, రెండడుగుల కింద భూమి స్వర్గమూ పుచ్చుకుని బలిచక్రవర్తిని పాతాళానికి పంపేశాడు. ఏటా బలిచక్రవర్తి బలిపాడ్యమినాడు భూమికి వస్తాడట. అందుకని ఆ ముందురోజు మనము దీపావళి చేసుకుంటాము.

రావణుడు సీతను ఎత్తుకుపోగా రాముడు వానరసేనతో వెళ్ళి రావణాసురుణ్ణి విజయ దశమినాడు చంపాడు. ఆ తరవాత రాముడు సీతతో తిరిగివచ్చి అయోధ్యలో



లోకకంటకుడైన నరకాసురుణ్ణి జయించటానికి శ్రీ కృష్ణుడు సత్యభామా సమేతుడై యుద్ధానికి వెళ్ళాడు. నరకుడి దెబ్బకు కృష్ణుడు మూర్ఛపోయినా, సత్యభామ ధర్మమా అంటూ నరకుణ్ణి చంపి, భూమిని నిష్కంటకం చేశాడు. నరకుడు చచ్చిననాడు నరక చతుర్దశి, మర్నాడు దీపావళి అమావాస్య, ఈ రెండూ మనకు పండుగలు.

క్రీస్తుకు 58 సంవత్సరాలు పూర్వం విక్రమ శకం ఆరంభమయింది. గుజరాతీలూ, మార్వాడీలూ, మరికొందరు ఆ శకాన్నే వాడుతున్నారు. విక్రమ సంవత్సరం దీపావళితో

మనకు దీపావళితో చలికాలం ఆరంభమవుతుంది. మనుషులకూ, పంటలకూ అనారోగ్యకరమైన క్రిమికీట కాదులు విజృంభిస్తాయి. మనం దీపావళినాడు కాల్చే బాణాసంచా ఈ క్రిమికీటకాలను నాశనం చేసే శక్తి గలది. ఎందుకంటే వీటిలో గంధకం ఉంటుంది. గంధకం కాలినప్పుడు వెలువడే పొగలు గాలిలోని రోగకణాలను నిర్మూలిస్తాయి.

దీపావళి పండగ పిన్నలకూ, పెద్దలకూ ఆనందాన్ని చేకూరుస్తుంది. పిల్లలు తలంట్లు పోసుకుంటారు. కొత్త బట్టలు కట్టుకుంటారు. అప్పచ్చులు తింటారు. టపాసులు కాల్చు




# చేతగాని ఆత్మహత్య

బొమ్మ చెప్పింది—తనకి జన్మలో బుద్ధి రాదు. ఇంకో జన్మ ఎత్తాలి. ఇంకో జన్మ ఎత్తాలంటే ముందు చావాలి. అందుచేత గుండుభీమన్న చావు కోసం ఎదురు చూడసాగాడు. అది ఎప్పుడు వస్తుందో, ఎలా వస్తుందో, అది మాత్రం వాడికి తెలీదు.

ఒకనాడు వాడు కట్టెలకోసం దారి పక్కనున్న చెట్టు ఒకటి ఎక్కి, మంచి కొమ్మ ఒకటి చూసుకున్నాడు. దానిని కొట్టాలంటే నిలబడటానికి వీలయిన చోటేది వాడికి కనిపించలేదు. అందుచేత వాడు ఆ కొమ్మమీదనే ఎక్కి దాన్ని కొట్టనారంభించాడు. ఆ సమయంలో దారి వెంబడి వెళ్ళే ఒక ముసలివాడు గుండు భీమన్నను చూసి, "అదేం పనిరా, అబ్బీ! కిందపడి పోతావు!" అని హెచ్చరించాడు.

"నాకు చెట్టెక్కటం చాత కాదనుకున్నావా? కొమ్మలు కొట్టటం చాత కాదనుకున్నావా? పడిపోతానని చెప్పటానికి నీకేమన్నా దివ్యదృష్టి ఉన్నదా? పదవయ్యా, పద!" అంటూ ముసలివాణ్ణి కొప్పడి, గుండుభీమన్న కొమ్మను కొట్ట సాగాడు.

కొద్ది సేపట్లోనే కొమ్మ విరిగిపడింది. దానితోపాటు భీమన్న కూడా పడ్డాడు. అయితే అదృష్టవశాత్తూ కొమ్మ ఒక్కసారిగా విరిగిపడక నింపాదిగా ఒరగటంవల్ల గుండు భీమన్నకు దెబ్బలేమీ తగలలేదు.

కాని వాడికి ముసలివాడి మీద మాత్రం గురి కుదిరింది. ఆ ముసలివాడు మంచి జ్ఞాని అయిఉండాలి; అందుకే జరగబోయేది అంత సరిగాచెప్పాడు! గుండు భీమన్న పరిగెత్తుకుంటూ వెళ్ళి ముసలాయనను కలుసుకుని, "అయ్యా, నన్ను మన్నించండి. మీరు త్రికాల వేదులన్నది తెలియక, నోటికి వచ్చినట్టు మాట్లాడి, మీకు అపచారం చేశాను. మీ రన్నట్టుగానే నేను



కిందపడి పోయాను," అన్నాడు, ఆయన ముందు సాష్టాంగపడి.

"నేను విశేషం ఏమీ చెప్పలేదులే, నాయనా. లే, లే!" అంటూ ముసలివాడు గుండుభీమన్నను లేవదీయ బోయాడు.

"మీకు సమస్తమూ తెలుసు! నే నెప్పుడు చచ్చిపోతానో చెప్పిన దాకా నేను మీ కాళ్ళు విడవను!" అన్నాడు గుండుభీమన్న.

వాడు బుద్ధిలేని వాడని ముసలివాడు గ్రహించి, వాడితో, "నాయనా, నీ ఆయుస్సు తీరిపోగానే చచ్చిపోతావు," అన్నాడు.

"ఆయుస్సు ఎప్పటికి తీరిపోతుంది?" అని గుండుభీమన్న మళ్ళీ అడిగాడు.

"నీ తల వెంట్రుకలన్నీ తెల్లబడిపోయాక ఆయుస్సు తీరిపోతుంది," అన్నాడు ముసలివాడు.

"తల వెంట్రుకలు తెల్లబడే దెలాగ?" అని మళ్ళీ అడిగాడు గుండుభీమన్న.

ఈ వెర్రివాణ్ణి వదిలించుకుందామను కుని ముసలివాడు, "అదెంత భాగ్యం? పొద్దున్నే లేచి మంచి గేదె పెరుగు వేసుకుని అన్నంతిని, ఆ చెయ్యి కడుక్కోకుండా జుట్టుకు రాసుకో. తరవాత నీకు మూడు తేపులు వస్తాయి. మూడో తేపుకు ప్రాణం పోతుంది," అన్నాడు ముసలివాడు.

గుండుభీమన్న ఈ సలహాతో పూర్తిగా తృప్తిపడి, ముసలివాడి కాళ్ళు వదిలాడు. వాడు తాను కొట్టిన కొమ్మను సరికి కట్టె పేళ్ళు వేసుకుని, వాటితో ఇంటికి వెళ్ళి బామ్మతో "బామ్మా, రేపు పొద్దున నాకు గట్టి గేదె పెరుగు వేసి అన్నం పెట్టాలి," అన్నాడు. తిండి విషయంలో రుచి ఏమిటో మనవడికి తెలిసివచ్చింది గదా అనుకుని బామ్మ సంతోషించింది. ఆవిడ గుండు భీమన్న కోసం మరింత జాస్తిగా పెరుగు తోడుపెట్టింది.

మర్నాడు లేస్తూనే గుండుభీమన్న తాను చావబోతున్నందుకు సంతోషించాడు. తాను

పోయాక తనను పాతెయ్యటం బామ్మకు లేనిపోని యాతన. అందుకని వాడు ఊరి బయటికి పోయి ఒక చోట లోతైన గుంట తవ్వి పెట్టుకుని ఇంటికి తిరిగివచ్చాడు.

బామ్మ వాడికి గట్టి పెరుగు వేసి అన్నం పెట్టింది. ముసలాయన చెప్పిన ప్రకారం వాడు పెరుగన్నం తినేసి తన ఎంగిలి చేతిని తలకు రుద్దుకున్నాడు. వెంట్రుకలకు పెరుగు అంటుకున్నది. అద్దంలో చూసుకుంటే వాడికి తన వెంట్రుకలు అక్కడక్కడా తెల్లగా ఉండటం కనిపించింది.

"జుట్టు తెల్లగా అయింది. ఇక ఆయుస్సు చెల్లి పోయినట్టే!" అనుకున్నాడు గుండు భీమన్న. అంతలోనే వాడికొక త్రేపు వచ్చింది. "ఒక ప్రాణం పోనే పోయింది. ఇంక రెండు ప్రాణాలు పోవాలి," అనుకుంటూ వాడు ఊరి బయట తాను తవ్వి ఉంచుకున్న గుంట వద్దకు పరిగెత్తాడు. వాడికి దారిలో రెండవ త్రేపూ, గుంట వద్దకు చేరాక మూడవ త్రేపూ వచ్చాయి.

"ఇప్పుడు నేను పూర్తిగా చచ్చిపోయాను," అనుకుంటూ గుండుభీమన్న గుంటలో దూకి గుంటను పూడ్చుకోసాగాడు. మట్టి మెడదాకా వచ్చేసరికి ఇక వాడి చేతులు పని చెయ్యలేదు. ఏం చెయ్యాలో



తోచక వాడు తల మాత్రం కనపడుతూ గుంటలో ఉండిపోగా, ఒక కుక్క అటుగా వెళుతూ, వాడి తలకు రాచిన పెరుగు వాసన పట్టి తోక ఆడించుకుంటూ వాడి దగ్గరకు వచ్చి, వాడి తలకు రాచిన పెరుగంతా శుభ్రంగా నాకేసి, వెళ్ళిపోయింది.

ఇంతలో ఆ దారినే ఒక షావుకారు గుర్రం మీద వచ్చాడు. నేల మీద ఉత్త మనిషి తల చూసి ఆయన మొదట్లో, అది బతికివున్న వాడి తల అనుకోలేదు. కాని సహాయం కోసం ఎదురుచూస్తున్న భీమన్న ఆయనను చూసి, గుంటపూడ్చమని కళ్ళతో అభినయం చేసి చెప్పాడు.

షావుకారు గుర్రం దిగివచ్చి, "ఏం తప్పు చేశావు? నీకీ శిక్ష విధించిన దెవరు?" అని అడిగాడు. ఆయన ఎన్ని ప్రశ్నలు వేసినా గుండుభీమన్న నోటితో సమాధానం చెప్పక కళ్ళతో సంజ్ఞలు చేశాడు. కాని షావుకారు ప్రశ్నలు మానలేదు.

చివరకు గుండుభీమన్న, ప్రాణంవిసిగి, "నేను చచ్చి పోయానయ్యా, బాబూ. నన్ను మరింత చంపక ఆ మట్టి వేసి గొయ్యి పూడ్చెయ్యి," అన్నాడు.

"చచ్చిపోతే ఎలా మాట్లాడుతున్నావు?" అని షావుకారు అడిగాడు, వాడు పిచ్చివాడని గ్రహించి.

"నేను చచ్చానని నీకు చెబితేనేగాని అర్థం కాకపోయె. ఏం చెయ్యనూ?" అన్నాడు గుండుభీమన్న.

"చూడు, అబ్బాయీ. నేను నీకు కొత్త జన్మ ఇస్తాను. మనిషి చచ్చినా జీవుడు చావడు. తెలుసా?" అన్నాడు షావుకారు.

"బామ్మకూడా ఆ మాటే అన్నది. స్వాములవారు ఆ మాటే చెప్పారు. ఆయన చచ్చి బతికాడు కూడా. నేను చచ్చికూడా జీవంతోనే ఉంటిని. అయితే నేనింక బామ్మ దగ్గిరికి వెళ్ళను. నన్ను అస్తమానమూ వెర్రికుంక అంటుంది," అన్నాడు భీమన్న.

"అలా అయితే నాతోరా," అంటూ షావుకారు వాణ్ణి గోతిలోనుంచి పైకి లాగాడు.

షావుకారుకు పనివాడు కావాలి. ఆయన నూనె కొనుక్కురావటానికి పోతున్నాడు.

"ఈ గుండిగ తీసుకుని గుర్రం వెనకనే నా వెంట రా. నూనె కొని నీ కిస్తాను. దాన్ని మా ఇంటికి పట్టుకు రా. నీకు పావలా కూలి ఇస్తాను. ఆ తరవాత మా ఇంటో పనికి పెట్టుకుని జీతం ఇస్తాను. సమ్మతమేనా?" అని షావుకారు గుండుభీమన్నను అడిగాడు. భీమన్న సమ్మతమేనని చెప్పి షావుకారు వెంట వెళ్ళాడు.

[పై మాసం మరొక సంఘటన]







# వద్దంటే సహాయం

చాలాకాలం క్రితం జక్కులమిట్ట అనే చిన్న కొండగుట్టకు సమీపంలో ఒక ధనవంతుడైన భూస్వామి ఉండేవాడు. ఆయన భార్య గొప్ప పనిమంతురాలు. రోజల్లా ఇంటిపని చెయ్యటమేగాక అర్ధరాత్రి దాటినదాకా మేలుకుని కూచుని ఇంటిల్లిపాదికి కావలిసిన నూలు తానే వడికేది, తానే అసు పోసేది, తానే పడుగూ పేకా వేసి మగ్గం మీద బట్టలు నేసేది.

ఇంత చాకిరీ చెయ్యటంవల్ల ఒక్కొక్కప్పుడామె అమితంగా అలిసిపోయేది. అయినా వళ్లబిగువున పని చేసేదేగాని మానేదికాదు.

ఒకనాటి రాత్రి అందరూ భోజనాలు చేసి నిద్రలకు పడ్డాక భూస్వామి భార్య రాట్నం ముందు కూచుని నూలు వడుకుతూ, "అబ్బబ్బ, ఎంతచేసినా ఈ పని తెమలదు. ఎవరన్నా వచ్చి కాస్త సాయంచేస్తే ఎంత బాగుణ్ణు!" అనేసింది.

మరుక్షణమే తలవాకిలి ఎవరో తట్టిన చప్పుడయింది. భూస్వామి భార్య, ఎవరై ఉంటారా అని ఆశ్చర్యపడుతూ, లేచి వెళ్లి తలుపు గడియ తీసింది. ఒక మరుగుజ్జు ఆడమనిషి గబగబా లోపలికి వచ్చి రాట్నం ముందు చతికిలబడి అమితవేగంతో నూలు వడకసాగింది. భూస్వామి భార్య తలుపు వేయబోతూండగా ఇంకో మరుగుజ్జు మనిషి వచ్చి పంటెకోల తీసుకుని నూలు చుట్టసాగింది. ఈ విధంగా ఒకరి తరవాత ఒకరుగా అయిదారుగురు మరుగుజ్జు స్త్రీలు లోపలికి వచ్చేశారు. అందరూ తలా ఒక పని అందుకున్నారు. కీచుగొంతుకలతో కేకలు పెడుతూ, శరవేగంతో అన్ని పనులూ ఒకేసారి సాగించారు. ఒకతె నూలు వడికింది, ఇంకొకతె చుట్టింది, మరొకతె అసు పోసింది, ఒకతె మగ్గం మీద కూచున్నది, ఒకతె చప్పుడు సిబ్బాన కింద మంటవేసింది.

బి. బాలనాగయ్య

వాళ్ళు చేసే చప్పుడుకు ఇల్లంతా దద్ద రిల్లింది. పక్క గదిలోనే పడుకుని నిద్ర పోతున్న తన భర్త లేస్తాడేమో, తనను తిట్టి పోతాడేమో నని ఇంటావిడ హడలిపోయింది.

కాని మత్తుమందు చల్లినట్టు ఆయన లేవనే లేదు. అది చూసి భూస్వామి భార్యకు వీళ్ళంతా యక్షిణులై ఉంటారని అను మానం తగిలింది. ఒక్కలమిట్టలో యక్షిణులు కాపరాలుంటారని జనం చెప్పుకునేవారు. యక్షిణులకు కొన్ని అసాధారణ శక్తులుంటాయి. వారంటే ప్రజలు భయపడేవాళ్ళు.

భూస్వామి భార్యకిప్పుడు భయమే పుట్టింది. ఇంతమంది యక్షిణుల మధ్య తాను ఒంటరిదైపోయిందాయె! వాళ్ళు చేసే రణగొణ ధ్వనికి అందరూ లేచి వస్తే బాగుండునని ఇప్పు డామెకు అనిపించింది. కాని ఏం లాభం? ఒక్కరూ లేవలేదు.

ఈలోపుగా మరుగుజ్జులు ఆమెను ఊరికే ఉండనియలేదు. కొందరు తాగటానికి మంచి నీళ్ళు అడిగారు. కొందరు ఆకలవుతున్న దని, తినటానికేమన్నా చేసి పెట్టమని అన్నారు. భూస్వామి భార్య వంట ఇంట్లోకి వెళ్ళి పొయ్యి రాజేసి వంట ప్రారంభిం చింది. ఆమె చేసే వంట చేస్తూనే ఉంది, వాళ్ళు తినే పదార్థాలు తింటూనే ఉన్నారు. వారి ఆకలి తీరే లక్షణాలేమీ కనిపించలేదు.



ఈ యక్షిణులను ఎలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తుండగా భూస్వామి భార్యకు తమ పొరుగున ఉన్న ముసలమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆ ముసలమ్మకు యక్షిణులను గురించి చాలా విషయాలు తెలుసు. ఆ చుట్టుపక్కల ఉండేవాళ్ళలో యక్షిణులను కళ్ళతో చూసిన మనిషి ఆవిడ ఒకతే.

అందుచేత భూస్వామి భార్య చేసేచేసే వంట వదిలేసి దొడ్డిదారిన వెళ్ళి ముసలమ్మను లేపి జరిగిన సంగతంతా చెప్పింది.

"ఓసి పిచ్చిదానా! ఆ యక్షిణులు రాకుండా ఉండాలేగాని వస్తే వదలరు. అజ్ఞానంచేత నువే వాళ్ళను ఆహ్వానించావు. ఇక ఎన్నడూ అలా సహాయం అడగకు. వాళ్ళను వెళ్ళగొట్టే ఉపాయం చెబుతా విను. ఇంటి బయట నిలబడి జక్కులమిట్ట తగలబడుతున్నదని కేకలు పెట్టు. ఆ కేకలు విని అందరూ బయటికి పరిగెత్తి పోతారు. నువ్వు వెంటనే తలవాకిలి గడియపెట్టి, వాళ్ళు ఏయే వస్తువులు ఎక్కడెక్కడ వదిలి వెళ్ళారో వాటన్నిటిని ఒరగబెట్టు, లేదా తలకిందులుచేసి ఉంచు," అని ముసలమ్మ భూస్వామి భార్యకు చెప్పింది.

ఆమె తన ఇంటికి తిరిగి వచ్చి బయట నిలబడి, "అయ్యయ్యో, మంటలు! జక్కులమిట్ట అంటుకుని మండుతున్నది!"



అని కేకలు పెట్టింది. ఈ కేకలు విని మరుగుజ్జు స్త్రీలందరూ పరిగెత్తుకుంటూ బయటికి వచ్చారు. ఎందుకంటే వాళ్ళ ఇళ్ళూ, పిల్లలూ, సంసారాలూ అన్నీ ఆ జమ్ముల మిట్టలోనే ఉన్నాయి.

వాళ్ళు బయటికి రాగానే భూస్వామి భార్య గబగబా లోపలికి వెళ్ళి గడియ పెట్టేసి అన్ని వస్తువులనూ ముసలమ్మ చెప్పిన ప్రకారం కదిలించి పెట్టేసింది.

తమ మిట్ట తగలబడటం లేదని తెలియగానే యక్షిణులు మళ్ళీ వచ్చి తలుపు తట్టారు. కాని భూస్వామి భార్య తలుపు తియ్యలేదు. వాళ్ళు అంతటితో వదలక, "ఓ కదురా, తలుపు తియ్యి!" "ఓ ఊదు గొట్టమా, తలుపు తియ్యి," అంటూ ప్రతి వస్తువునూ కేకపెట్టారు. ఒక్క వస్తువూ పలకలేదు, కదలలేదు.

చివరకొక యక్షిణి, "ఓ బాన కింది కట్టె పుల్లా, తలుపు తియ్యి!" అన్నది.

బాన కింద మండుతున్న కట్టెపుల్ల అమాంతంగా లేచి తలుపు గడియ తీయటానికి బయలుదేరింది. వెంటనే భూస్వామి భార్య చెంబెడు నీళ్ళు దానిపై కుమ్మరించేసరికి ఆ కట్టెపుల్ల కాస్తా చుంయి మని చల్లారి అక్కడే పడిపోయింది.

తలుపు తట్టటం మానేసికూడా యక్షిణులు ఇంటి బయట కాకిగోల చేస్తున్నారు. భూస్వామి భార్య తన భర్తను లేపటానికి ప్రయత్నించింది, కాని ఆ మానవుడు గురక పెట్టి నిద్రపోతూ ఎంతకీ లేవలేదు. ఇలా కాదని ఆమె చప్పుడునీళ్ళు ఇన్ని తీసుకుని తన భర్త మీద కుమ్మరించింది.

వెంటనే భూస్వామి లేచి, "బయట ఆ గోల ఏమిటి?" అంటూ వెళ్ళి తలవాకిలి తలుపు తెరిచి చీకట్లోకి ముఖం చిట్లిస్తూ చూశాడు. అప్పుడు బయట సద్దుమణిగింది. యక్షిణులు తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ తరవాత వాళ్ళు ఎవరి ఇళ్ళకూ రాలేదు.





# అపూర్వ శక్తులు

ఒక జమీందారుకు ఒక కొడుకు పుట్టాడు. వాడికి విజయుడని పేరు పెట్టుకున్నారు. వాడి జాతకం చూసి దైవజ్ఞులు, "ఈ పిల్లవాడి జాతకంలోని గ్రహస్థితి చూస్తే అపూర్వ శక్తులు గలవాడవుతాడని తోస్తున్నది. ఎక్కడికి వెళ్ళినా కీర్తిప్రతిష్ఠలూ, పుష్కలంగా ధనమూ గడించగల జాతకం," అన్నారు.

ఈ మాటలు విని జమీందారు సంతోషించి, విజయుణ్ణి ఎంతో గారాబంగానూ, ఏ లోటూ లేకుండానూ పెంచాడు. విజయుడు పెరిగి పెద్దవాడవుతూంటే తండ్రి వాడిలో ఏవైనా అపూర్వ శక్తులున్నాయేమోనని శ్రద్ధగా గమనించాడు. కాని ఆయనకు అలాటి దేమీ కనపడలేదు. విజయుడు మామూలు పిల్లలలాగే కనిపించాడు. వాడిలో ప్రత్యేకమైన తెలివితేటలుకూడా ఉన్నట్టు కనపడ లేదు. ఒకప్పుడు కాస్త వివేకంతో మాట్లాడితే మరుక్షణమే అజ్ఞానంగా మాట్లాడే వాడు. చెప్పిన మాట ఒకసారి వినేవాడు, మరొకసారి మకురుతనం చేసేవాడు. దైవజ్ఞులు ఇచ్చకాలకు అబద్ధాలాడారని జమీందారు అనుకుని, కొడుకుపైన లేనిపోని ఆశలు పెట్టుకోవటం మానుకున్నాడు.

ఇంతలో ఒక ఘటన జరిగింది. ఒకరోజు ఉదయం విజయుడు తమ ఆవరణలో ఉన్న మామిడిచెట్టు కింద కూచుని, పైకిచూస్తూ, నోటితో అర్థంలేని ధ్వనులు చేస్తూండటం వాడి తండ్రి చూశాడు.

"వీడికేమన్నా మతిపోయిందా ఏమిటి?" అనుకుంటూ జమీందారు వాణ్ణి సమీపించాడు. ఆయన చెట్టు కిందికి రాగానే చెట్టు కొమ్మలలో నుంచి అనేక పిట్టలు విలవిలా ఎగిరిపోయాయి.

"అయ్యో, నాన్నగారూ! పిట్టల్ని బెదరగొట్టేశారు!" అన్నాడు విజయుడు.

హెచ్. రామశేషరావు



"నువ్వసలు ఇక్కడ కూచుని ఏం చేస్తున్నావు?" అని తండ్రి అడిగాడు.

"ఆ పిట్టలతో మాట్లాడుతున్నాను. అవి ఎక్కడెక్కడో తిరిగిచూసిన విశేషాలన్నీ చెబుతున్నాయి. నాకు తెలీని విషయాలు ఎన్నో వింటున్నాను," అన్నాడు విజయుడు.

"అదెలా సాధ్యం రా? వాటి భాష మనకు తెలియదుగా?" అన్నాడు తండ్రి.

"నాకు తెలుస్తుంది, నాన్నగారూ. నేను వాటితో మాట్లాడగలను కూడా!" అన్నాడు విజయుడు.

వాడు చేస్తున్న అర్థంలేని చప్పుళ్ళు ఆ పిట్టల భాష అయి ఉండాలని, జ్యోతిష్కులు చెప్పినట్టే వాడికి పక్షుల భాష అర్థం చేసుకునే అపూర్వశక్తి సిద్ధించిందని జమీందారుకు అర్థమయింది. విజయుడు ప్రయోజకుడవుతాడన్న మాటకూడా నిజమవుతుంది గదా అని ఆయన సంతోషించాడు.

కొద్ది రోజులు గడిచాయి. ఒకనాడు జమీందారు భోజనం చేస్తూంటే విజయుడు ఆయన వెనక నిలబడి విసనకర్రతో విసురుతున్నాడు. బయట పెంపుడు పావురాలు ఎగురుతూ "కుర్, కుర్," అని గొడవగా అరుస్తున్నాయి.

జమీందారు కిటికీలో నుంచి, బయట వాలుతూ ఎగురుతూ ఉండే పావురాలను చూసి, "ఒరే, బాబూ! నీకు పక్షుల భాష తెలుసునంటివే. ఆ పావురాలు ఏం మాట్లాడుకుంటున్నాయో చెప్పు, చూద్దాం. అవి రోజూ ఇంత రొదచెయ్యవే," అన్నాడు.

విజయుడు జంకుతున్నట్టుగా, "వద్దులెండి. అవి అనుకునే మాటలు నాకే బాగా లేవు. మీరు వింటే ఆగ్రహిస్తారు," అన్నాడు.

వాడా మాట అన్నాక జమీందారుకు పావురాలనే మాట ఏమిటో తెలుసుకోవాలని మరింత ఆత్రం పుట్టుకొచ్చి, విజయుడు చెప్పినదాకా విడిచిపెట్టలేదు.

"మీరు భోంచేస్తూంటే నే నెలా మీకు విసురుతున్నానో, నేను భోజనం చేస్తూంటే మీరు నాకు అలా విసిరే రోజు వస్తుం దని ఆ పావురాలు చెప్పుకుంటున్నాయి," అన్నాడు విజయుడు.

ఈ మాటలు వినగానే జమీందారుకు ఆగ్రహం వచ్చేసింది.

"ద్రోహీ! నీ మాటలు నేను నమ్మను. పావురాలేమన్నా కేరళపక్షులా, జోస్యం చెప్ప టానికి? నీకే ద్రోహబుద్ధి కలిగింది. నేను బతికుండగానే జమీ అంతా కాజేసి నా చేత ఊడిగం చేయించుకుందా మనుకుంటు న్నావు. నా ఇల్లు విడిచి తక్షణం వెళ్ళిపో! మళ్ళీ నా కళ్ళబడకు!" అని జమీందారు వెర్రికేకలు పెట్టాడు.

విజయుడు తండ్రికి మంచిగా చెప్పి చూశాడు. "నా కెలాటి ద్రోహబుద్ధీ లేదు. అవి అనుకున్న మాటలే చెప్పాను. ఆ మాటలు మీ కెంత కష్టంగా ఉన్నాయో, నాకూ అంత కష్టంగానే ఉన్నాయి. అందుకే మొదట చెప్పనన్నాను." అన్నాడు.

అయినా జమీందారు మంకుపట్టుపట్టి విజయుడు తన గ్రామం నుంచి వెళ్ళిపోవలిసిందే నన్నాడు.

నిజానికి విజయుడు ఇల్లు విడిచి వెళ్ళ టానికి అట్టే చింతించలేదు. ఎందుకంటే





ప్రపంచం చూడాలనే ఉబలాటం పక్షుల ద్వారా వాడికి చాలా కాలంగా కలిగింది. వాటిద్వారా వాడు ప్రపంచంలోని ఎన్నో వింతలను గురించి విని ఉన్నాడు. వాటిని ప్రత్యక్షంగా చూసే అవకాశం వాడి కిప్పుడు దొరికింది.

జమీందారుగారి గ్రామం సముద్రతీరాన ఉన్నది. విజయుడు ఏకంగా సముద్రం దాటి, అవతల ఉండే దేశాలు చూడాలని నిశ్చయించాడు. అదృష్టవశాత్తూ సముద్రం మీద ప్రయాణమైపోతున్న ఓడ ఒకటి వాడికి తటస్థపడింది. వాడు దానిలో ఎక్కి ప్రయాణమయాడు.

ఆ ఓడ విజయుణ్ణి త్వరగా సింహళానికి చేర్చింది. ఓడ దిగి వాడు కాలినడకను ప్రయాణం సాగించాడు. పోగాపోగా వాడి కొక రమ్యమైన పూలతోటా, దాని అవతల ఎత్తయిన చెట్లు గల తోపూ, వాటికి ఎగువగా బంగారు పూతపూసిన కలశాలతో అలంకరించి ఉన్న మేడల శిఖరాలూ కనిపించాయి.

"అదేదో రాజభవనం అయి ఉండాలి," అనుకుంటూ విజయుడు పూలతోట మీదుగా తోపు ప్రవేశించాడు. ఎవరో చెట్లు కొట్టుతున్న చప్పుడు వాడికి వినవచ్చింది. ఈ చప్పుడుతోబాటు వాడికి మరొక ధ్వని కూడా విన వచ్చింది. రాజభవనానికి ఎగువగా ఆకాశంలో కొన్నిలక్షల పిచ్చుకలు కిచకిచలాడుతూ ఎగురుతూ ఉండటం కనిపించింది. రాజభవనం సమీపిస్తున్న కొద్దీ ఆ పిచ్చుకల రొద దుర్భరమయింది.

విజయుడు ఈ వింత చూసి ఆశ్చర్య పడుతూ, తన చెవులను చేతులతో గట్టిగా మూసుకుని ముందుకు సాగాడు.

రాజుగారి నౌకరు ఒకడు విజయుణ్ణి చూసి, "బాబూ, కాస్సేపటికే తమరు చెవులు మూసుకున్నారే, రాత్రింబగళ్ళు ఈ రొదతో మేము చచ్చిపోతున్నాము.

బయట ఎన్ని పిచ్చుకలున్నాయో, అన్ని పిచ్చుకలు రాజభవనం లోపల ఉన్నాయి. వాటిని ఎలా వదిలించుకోవాలో తెలియక మా రాజుగారి మతిపోతున్నది," అన్నాడు.

ఆ పిచ్చుకల బెడద వదిలించటం తన వల్లనే కావచ్చునని విజయుడికి తోచింది. వాడు రాజుగారి నౌకరుతో, "నన్నొకసారి మీ రాజుగారి దగ్గిరికి తీసుకుపోతావా ఏమిటి?" అన్నాడు.

నౌకరు విజయుణ్ణి రాజభవనంలోకి తీసుకుపోయాడు. లోపలి సవసలలో వేల కొద్దీ పిచ్చుకలు రెక్కలు తపతపా కొట్టుకుంటూ నానాగొడవా చేసేస్తున్నాయి.

రాజుగారు ఒంటరిగా ఒక గదిలో కూచున్నారు. పిచ్చుకలు రాకుండా ఆ గది కిటికీలన్నీ మూశారు. ద్వారంకూడా మూసి అక్కడ ఒక మనిషిని కాపలా ఉంచారు. విజయుడి కోసం ద్వారం తెరిచినప్పుడు ఒక చొరవైన పిచ్చుక గదిలోకి రానేవచ్చింది.

విజయుడు రాజుగారితో, "మహారాజా, మీకు పట్టుకున్న ఈ పిచ్చుకల బెడద చూస్తున్నాను. దీన్ని వదలగొట్టటం చాతనయితే నా ఒక్కడికే చాతకావాలి," అన్నాడు.

ఈ మాట వినగానే రాజుగారి ముఖం విప్పారింది. "నీవు ఈ ఉపకారమే చేస్తే నీ ఋణం ఉంచుకోను సరే కదా, యూవ



జీవం నీకు కృతజ్ఞుణ్ణయి ఉంటాను. కాని ఎవరివల్లాకాని ఈ పని నీ వల్ల ఎలా అవుతుంది?" అని ఆయన అడిగాడు.

"మహారాజా, ఈ పిచ్చుకలిలా పెచ్చుమీరి ప్రవర్తించటానికేదో కారణం ఉండి ఉంటుంది. అవి ఎందుకో మీ మీద పగబట్టి ఇలా చేస్తున్నాయి. నాకు పక్షి భాష తెలుసును. వాటి కోప కారణం నేను వాటి ద్వారానే తెలుసుకుంటాను. అప్పుడు మీరు వాటిని సమాధానపరచటానికి తగిన యత్నంచేయవచ్చు," అంటూ విజయుడు తన వెనకగా రాజుగారి గదిలోకి జొరబడిన పక్షితో మాట్లాడి రాజుగారికేసి తిరిగి,

"ఇదేమీ పెద్ద సమస్యకాదు, మహారాజా. మీరు తోపులో చెట్లన్నీ కొట్టెయ్యమని ఆజ్ఞ ఇచ్చారట. ఆ చెట్లపై గూళ్ళు పెట్టుకుని నివసించే ఈ పిచ్చుకలకు కోపం వచ్చి ఆగడానికి పూనుకున్నాయి. చెట్లను కొట్టే ప్రయత్నం విరమించండి, ఇవి మిమ్మల్ని బాధించవు," అన్నాడు.

రాజుగారు చెట్లు నరకటం మాన్పించాడు. పిచ్చుకలు ఆయనను బాధించటం మానాయి. రాజుగారు విజయుడికి ఒక పెద్ద ఓడా, అంతులేని బంగారమూ, నౌకర్లూ బహూకరించాడు. ఆ ఓడలో ప్రయాణిస్తూ విజయుడు అనేక రాజుల వద్దకు వెళ్లాడు.



వకుల మూలంగా ఎవరికీ తెలియని లోక వార్తలు అతనికి తెలియటం వల్ల అతను వెళ్లిన చోటనల్లా గొప్ప గౌరవం లభించింది, సన్మానాలు దొరికాయి.

ఈ విధంగా పదేళ్లకాలం దేశాటన చేసి విజయుడు ఏ వర్తకులూ సంపాదించ లేనంత సంపద సంపాదించాడు. చివరకు అతనికి ఇంటిపై గాలి మళ్ళింది. అతను తన ఓడలో స్వదేశానికి తిరిగి వచ్చి తన గ్రామానికి సమీపంగా రేవులో లంగరు దించాడు.

ఎవడో మహా ధనికుడైన వర్తకుడు తమ రేవులో దిగాడని జమీందారుకు తెలిసింది. ఆ మహావ్యక్తి తన కొడుకేనని తెలియక జమీందారు స్వయంగా వచ్చి విజయుణ్ణి తన ఇంటికి విందుకు పిలిచాడు. అతని బంధువర్గమంతా విందు భోజనానికి కూచు న్నారు. అంత చిన్నతనంలోనే అంత ధనమూ, అంత లోకజ్ఞానమూ, వివేకమూ సంపాదించిన తన అతిథిపై జమీం దారుకు ఎక్కడలేని గౌరవమూ ఏర్పడింది. ఆయన విసనకర్ర తీసుకుని తన అతిథికి విసరసాగాడు.

అది చూడగానే విజయుడు ఫక్కున నవ్వాడు. జమీందారు అతన్ని ఆశ్చర్యంతో చూసి, "ఎందుకు నవ్వుతున్నారు?" అని అడిగాడు.

"నన్ను గుర్తు పట్టనేలేదా, నాన్నగారూ? ఆ రోజు పావురాలన్న మాటలు ఎలా నిజ మయాయో చూశారా? నేను విజయుణ్ణి!" అన్నాడు విజయుడు.

జమీందారు తన కొడుకు ఇంతవాడై నందుకూ, తిరిగి తన వద్దకు వచ్చినందుకూ పరమానందం చెంది, అతణ్ణి కౌగలించు కుని ఆనంద బాష్పాలు రాల్చాడు. విజ యుడి రాకకు బంధువర్గమంతా సంతో షించింది. విజయుడు వివాహం చేసుకుని, తండ్రి ఇంటనే సుఖంగా ఉన్నాడు.






భరతుణ్ణి అతని మేనమామ వచ్చి తీసుకు పోయాడు. శత్రుఘ్నుడు వెంట లేనిదే ఏవి, భోగాలూ తనకు రుచించవు గనక భరతుడు శత్రుఘ్నుణ్ణి తన వెంట తీసుకు పోయాడు. భరతుడి మేనమామ ఇంట వారిద్దరికీ ఏ లోటూ లేకుండానే జరుగు తున్నది. అయితే ముసలివాడైన తండ్రిని విడిచి వచ్చామే అన్నది అప్పుడప్పుడూ వారిని బాధించేది.

అయోధ్యలో దశరథ మహారాజుకూడా తన కొడుకులలో ఇద్దరు దూరమై పోయారే అని చింతించేవాడు. కాని నిజానికి ఆయన పంచప్రాణాలూ రాముడే. అతనిలో లేని సద్గుణం లేదు. ప్రజలకుకూడా రాముడంటే ఎంతో అభిమానం.

"నేను ముసలివాణ్ణి అయిపోయినాను. రాముణ్ణి రాజును చేసి అతను రాజ్యపాలన చేస్తుంటే చూడాలని నా మనసు ఉబలాట పడుతున్నది," అనుకున్నాడు దశరథుడు.

మంత్రులతో ఆలోచిస్తే వారుకూడా ఈ ఆలోచనను ఆమోదించారు. ఇందుకు ప్రజలూ, ఇతర రాజులూ ఏమంటారో తెలుసుకోవలిసి ఉన్నది. అందుచేత దశరథుడు రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. చాలాదూరాన ఉన్న కారణంచేత కైకేయి తండ్రి అయిన కేకయ మహారాజుకూ, సీత తండ్రి అయిన జనక మహారాజుకూ ఆహ్వానాలు పంపక, ఈ శుభవార్త వారికి పట్టాభిషేకం అయిన తరవాత తెలుపుదా మనుకున్నాడు.







ఆహ్వానాలు అంది రాజులందరూ వచ్చి దశరథుడి కొలువు కూటంలో ఉచితాసనాలపై కూచున్నారు. నగరంలోని పౌరులూ, పల్లెటూళ్ళవాళ్ళూ కూడా సభకు వచ్చారు. దశరథుడు వారితో తాను ఎంత శ్రద్ధగా రాజ్యం చేసినదీ వివరించి, "ఇప్పుడు నేను ముసలివాణ్ణి అయిపోయి విశ్రాంతి కోరుతున్నాను. మీ అందరూ సమ్మతిస్తే నా పెద్ద కొడుకైన రాముణ్ణి రాజుగా అభిషేకించాలని ఉన్నది. రాముడు పరాక్రమశాలి, ఎందులోనూ నాకు తీసిపోడు. అతను మూడు లోకాలూ ఏలదగినవాడు. అతనికి పట్టం గట్టటం రాజ్యానికి గొప్ప మేలు చేయటమేనని నా నమ్మకం. నా ఆలోచన మీకు నచ్చిన పక్షంలో ఇందుకు సమ్మతించండి. సమ్మతించని పక్షంలో మీకు తోచిన మరొక మేలైన మార్గం చెప్పండి," అన్నాడు.

ఈ మాటలు విని సభలో అందరూ పరమానందం చెంది, రాముడి పట్టాభిషేకానికి ఏకగ్రీవంగా ఆమోదించారు. "మహారాజా, ఆ రామపట్టాభిషేక మహోత్సవం ఊరేగింపు త్వరగా మా కళ్ళ పడెయ్యండి," అన్నారు.

వెంటనే దశరథుడు అమాయికత్వం నటిస్తూ, "నేనింకా రామపట్టాభిషేకం అని అనకుండానే మీరంతా సమ్మతిస్తున్నారే? ఏమిటి కారణం? నా పరిపాలన మీకు నచ్చలేదా? నేను ఎంతో న్యాయంగా పరిపాలిస్తున్నా మీరు రాముణ్ణి రాజుగా కోరటానికి కారణమేమిటి? మరేమీ లేదు, తెలుసుకోగోరి అడుగుతున్నాను!" అన్నాడు.

ఆయన ఆ మాట అనగానే ఆయనకు కావలిసినది జరిగింది; సభికులు రాముణ్ణి తెగపొగడేశారు. అతన్ని రాజుగా చేస్తే ఇక అంతకంటె ఘనమైన సంగతి ఉండబోదన్నారు.

వారి మాటలన్నీ విని దశరథుడు, "మీరు కూడా నా లాగే భావిస్తున్నందుకు నా కెంతో

సంతోషంగా ఉంది," అంటూ అప్పుడే తన పురోహితులైన వసిష్ఠ వామదేవాదులను పిలిపించి, "మహామునులారా, ఈ చైత్ర మాసం శుభకార్యాలు చేయదగినది. అందు చేత రామపట్టాభిషేక యత్నాలు సాగించండి, అందుకు కావలిసిన సామగ్రి అంతా తెప్పించండి," అని అందరూ వింటూండగా అన్నాడు.

వసిష్ఠుడు అప్పటికప్పుడే పనివాళ్ళతో ఏయే సామగ్రి సిద్ధం చేయాలో చెప్పేశాడు. పట్టాభిషేక మహోత్సవానికి కావలిసిన సరంజామా అంతా సిద్ధమయింది.

దశరథుడు రాముణ్ణి తన వద్దకు తీసుకు రమ్మని తన సారథి అయిన సుమంత్రుడితో చెప్పాడు. సుమంత్రుడు వెళ్ళి రథంలో రాముణ్ణి తెచ్చాడు. దశరథుడు రాముడితో, "నాయనా, నీకు రాజ్యాభిషేకం చేస్తాను. ధర్మాన్ని పాలిస్తూ తగినవిధంగా నీవు రాజ్యం ఏలుకో," అని చెప్పి అతన్ని పంపేశాడు. తరవాత, దూరదేశాల నుంచి వచ్చిన రాజులూ, ప్రజలూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. రాముడి మిత్రులు కొందరు కౌసల్యకు ఈ శుభవార్త చెప్పారు. కౌసల్య ఆనందంతో వారికి బంగారమూ, ఆవులూ, రత్నాలూ బహూకరించింది.



అందరూ వెళ్ళాక దశరథుడు తన మంత్రులతో ఆలోచించి, "రేపు పుష్యమి నక్షత్రం. పట్టాభిషేకానికి చాలా బాగుంటుంది. అందు చేత రేపే జరుపుదాం," అని నిశ్చయించి, రాముణ్ణి తీసుకురమ్మని సారథిని సుమంత్రుణ్ణి పంపాడు.

సారథి వచ్చి తండ్రిగారు రమ్మంటున్నారని చెప్పగానే రాముడు, "నే నిప్పుడు అక్కడి నుంచే వస్తున్నాను. మళ్ళీ ఎందుకు రమ్మన్నారు?" అని అడిగాడు.

"మహారాజుగారు తమరిని చూడా లన్నారు. వస్తె రండి, లేకపోతే మానండి. అది మీ యిష్టం," అన్నాడు సారథి.



రాముడు తొందరపడి సారథి వెంట బయలుదేరాడు. పై వాళ్ళెవరూ లేరుగనక దశరథుడు ఈసారి తన కాళ్ళకు నమస్కరించే రాముణ్ణి లేవనెత్తి, ఆలింగనం చేసుకుని, ఉన్నతాసనంపై కూచోబెట్టి, "నాయనా, రామా! నేను ముసలివాణ్ణి కావటం అలా ఉంచి, నా జన్మనక్షత్రంలో దుష్టగ్రహాలు చేరాయని జ్యోతిష్కులు చెబుతున్నారు. పీడకలలు వస్తున్నాయి. కనక నా దేహంలో ఊపిరి ఉండగానే పట్టం కట్టుకో. ఇవాళ పుష్యమి. రేపు పునర్వసు. శుభకార్యాలకు చాలా మంచిది. ఈ రాత్రికి నీవూ, నీ భార్యా దర్భలపై



పడుకుని ఉపవాసం చెయ్యాలి. నీ తమ్ముడు భరతుడు తన మేనమామ ఇంటి నుంచి తిరిగిరాక పూర్వమే ఈ పట్టాభిషేకం ముగించటం మంచిదని నాకు తోచింది. వాడైనా పెద్దలంటే భక్తిగలవాడే; ఈ పట్టాభిషేకానికి ఎదురు చెప్పబోడు. అయినా మానవ స్వభావం అమిత చంచలమైనది," అని చెప్పాడు.

రాముడు తండ్రి అనుమతితో అక్కడి నుండి బయలుదేరి తన తల్లి అయిన కౌసల్య మందిరానికి వచ్చేసరికి ఆమె మౌనంతో రాజ్యలక్ష్మిని ప్రార్థిస్తూ కనిపించింది. రాముడు రాకపూర్వమే పట్టాభిషేక వార్త తెలిసి సుమిత్రా లక్ష్మణులు సీతను తమ వెంట కౌసల్య మందిరానికి తెచ్చారు.

రాముడు తల్లికి నమస్కరించి తన పట్టాభిషేక వార్త తెలిపి, "అమ్మా, రేపటి పట్టాభిషేకానికి నేనూ, సీతా ఏమేమి అలంకారాలు చేసుకోవాలో అవన్నీ చెయ్యించు," అని కోరాడు.

రాముడు లక్ష్మణుడితో, "లక్ష్మణా, నాతోబాటు నీవుకూడా ఈ భూమినంతా పాలింతువుగాని. మనిద్దరమూ ఒకటేగదా. నేను రాజయితే నీవూ రాజువే. మనిద్దరమూ



సమస్త సుఖాలూ ఒక్కటిగా అనుభవించుదాం," అన్నాడు.

తరవాత అతను తల్లుల అనుమతి పొంది సీతతోసహా తన మందిరానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రాముడిచేతనూ, సీతచేతనూ ఉపవాసవ్రతం సక్రమంగా చేయించటానికి దశరథుడి కోరికపై వసిష్ఠుడు రథమెక్కి రాముడుండే నగరుకు వెళ్ళి ఆ పని పూర్తి చేసి తిరిగి వచ్చే సమయంలో వీధులన్నిటా జనం తండోపతండాలుగా కనిపించారు. రేపటి ఉత్సవం తాలూకు ఉత్సాహంలో వారు సంతోషధ్వానాలు చేస్తున్నారు. వీధులలో నీళ్ళు చల్లి, పూలదండలు కట్టారు. ప్రతి ఇంటిమీదా జెండా ఎగురుతున్నది. స్త్రీలూ, పిల్లలూ, వృద్ధులూ ఇప్పటినుంచే పట్టాభిషేకానికి ఎదురు చూస్తున్నారు.

వసిష్ఠుడు వెళ్ళిపోయాక రాముడు స్నానం చేసి, సీతతోకూడా హోమం చేసి, హోమశేషం తిని, నిశ్చలమైన మనస్సుతో నారాయణాలయంలో భగవంతుణ్ణి ధ్యానం చేసి అక్కడే పడుకుని ఒక ఝాము సేపు నిద్రపోయి, వందిమాగధుల మేల్కొలుపులకు లేచాడు.

అతను ఉదయం సంధ్యావందనం మొదలైనవి పూర్తి చేసేసరికి తెల్లవారింది.



బ్రాహ్మణులు వచ్చి పుణ్యాహవాచనం చేశారు. మంగళవాద్యాలతో అయోధ్య యావత్తూ మారుమోగిపోయింది.

తెల్లవారుతూనే మళ్ళీ పౌరులు తమ ఇళ్ళను అలంకరించసాగారు. ఇళ్ళ ముందు నీళ్ళు చల్లి, పువ్వులు చిమ్మారు. సుగంధ ధూపాలు వేశారు. జనం గుంపులుగా గూడి పట్టాభిషేకం గురించే మాట్లాడుకుంటు న్నారు. పిల్లలు ఇళ్ళముందు ఆడుకుంటూ, "ఇవాళ పట్టాభిషేకం చూడటానికి నేను కూడా మా అమ్మా, నాన్నా వెంట పోతాను," అని చెప్పుకుంటున్నారు. ఆడేవాళ్ళు ఆడుతున్నారు, పాడేవాళ్ళు పాడుతున్నారు.









కాని ఆ రాత్రే మరొకరకం నాటకం ఆరంభమయింది. కైకేయి వెంట మంధర అనే ఒక గూని దాసి ఆమెకు అరణంగా వచ్చింది. ఆ మంధర ఆ రాత్రి కైకేయి ఉండే మేడ పై అంతస్తుకు వెళ్ళి అక్కడి నుంచి అయోధ్యలో జరిగే సందడి అంతా చూసి ఆశ్చర్యపడింది. తన పక్కనే తెల్ల పట్టుచీరె గట్టి నిలబడి ఉన్న ఒక దాదితో మంధర, "ఈ ఆర్భాటమంతా ఏమిటే? కౌసల్య ఏదన్నా వ్రతంపట్టి జనానికి దాన ధర్మాలు చేస్తున్నదా? లేక దశరథుడు ఏదన్నా ఉత్సవం తలపెట్టాడా?" అన్నది. ఆ దాది పొట్ట చెక్కలయేలాగ నవ్వి, "తెల్లవారగానే రాజుగారు రాముడికి రాజ్యాభిషేకం చేస్తున్నారు." అని చెప్పింది.

గూని మంధరకు ఈ వార్త కర్ణకఠోర మయింది. ఆమె గబగబా మేడ దిగి, కైకేయి పడుకుని ఉన్న చోటికి వెళ్ళి, "లే, లే! ఏం పడుకున్నావు? నీ కొంప నిలువునా కూలబోతున్నది. ఆ రాజుకు నీ మీద ఉన్న ప్రేమ మరెవరిమీదా లేదని మహా మురిశావు! ఇక ముసద్ధువుగాని!" అన్నది.

"నీ వాలకం చూస్తే ఏదో జరిగినట్టుందే! అందరూ క్షేమంగానే ఉన్నారు గద!" అన్నది కైకేయి.

"రేపు దశరథమహారాజు రాముడికి రాజ్యాభిషేకం చేయబోతున్నాడు. ఇంకేం జరగాలి. ఈ మాట వినగానే నా గుండె జారిపోయింది. నీ మంచి కోరేదాన్ని గనక ఈ మాట వింటూనే నీ దగ్గిరికి పరిగెత్తు కొచ్చాను," అన్నది మంధర.

"నిజంగానా, మంధరా? ఎంత మంచి వార్త తెచ్చావు!" అంటూ కైకేయి వికసించిన ముఖంతో పక్క మీద లేచి కూచుని, విల వైన ఆభరణం ఒకటి తీసి ఇస్తూ, "ఇంకేం కావాలన్నా ఇస్తాను, అడుగు!" అన్నది.

కైకేయి ధోరణి మంధరకేమీ నచ్చలేదు. ఆమె తన యజమానురాలితో, "మూఢు

రాలా, నీకు రాబోయే విపత్తు అర్థం చేసుకో లేకుండా ఉన్నావు. లేకపోతే దుఃఖించ టానికి బదులు ఆనందిస్తావా? నీకు బదులు కూడా నేనే ఏడుస్తున్నాను. ఎందుకంటావా? రేపే పట్టాభిషేకం జరగగానే కౌసల్య రాజ మాత అవుతుంది. నీవు ఆమెకు పరిచారిక వవుతావు. రాముడి అంతఃపుర స్త్రీలకు నీ కోడళ్లు దాసీలవుతారు. భరతుడూ, అతని సంతతీ రూపుమాసి పోవలసిందే. నాకు బహుమానం ఇస్తానంటావే? నీకేమి జరిగిందని బహుమానం ఇస్తావు? రాజ్యాభి షేకం భరతుడికి జరిగినప్పుడుగదా నేను నీ బహుమానాలు పొందవలసింది? భరతుడు దూరాన మామగారింట ఉండ బట్టీ గాని, దశరథుడు నీపై ప్రేమకొద్దీ అతనికే ఈ పట్టాభిషేకం చేసి ఉండడా? రాముడు రాజయాక భరతుడిక ఇక్కడికి రానవసరంలేదు. అటునుంచి అటే అడవికి పోవటం మేలు. ఎందుకంటే రాముడు అతణ్ణి బతకనివ్వడు. నీ భర్త నీ మీద ఎక్కువ ప్రేమగా ఉంటాడన్న అహం కారంతో ఇంతవరకూ నీవు కౌసల్యను చాలా లోకువగా చూశావు. ఇక ఆవిడ నీపై పగ తీర్చుకోకుండా ఊరుకుంటుందా? నీకు నిజంగా సమర్థతే ఉంటే ఈ పట్టం భరతు డికి కట్టించు! భరతుడికి పోటీ అయిన రాముణ్ణి అడవిలోకి తోలించు! ఇంత రాజ్యానికి భరతుడు రాజవుతాడు, నీవు రాజమాతవై గౌరవం పొందుతావు. రాముడు రాజైతే నీ పతనం తప్పదు. నీ ముఖం చూసేవారుండరు," అని ఎడాపెడా అనేసింది.

ఈ మాటలు కైకేయి తలకెక్కాయి. ఆమె ముఖం వెప్పురించింది. క్రోధావేశంతో ఆమె మంథరను చూసి, "అవును, భర తుడు రాజు కావలసిందే, రాముడడవి పాలు కావలసిందే! కాని అది ఎలా సాధ్య పడుతుంది?" అన్నది.





# ఖలీఫా ఉమర్ శీలం

మహమ్మద్ ప్రవక్త దేహం చాలించిన అనంతరం ఆయన ఉపదేశాలను ప్రచారం చెయ్యటానికి ఆయన మేనమామ అయిన అబు బెకర్ మొదటి ఖలీఫా అయాడు. ఆయన ముసల్మానులకు మతశాసకుడూ, సర్వాధికారాలు గల నాయకుడూనూ.

అబు బెకర్ ఖలీఫా అనంతరం ఉమర్ ఇబన్ అల్ ఖత్తాబ్ అనే ఆయన రెండవ ఖలీఫా అయాడు.

హారూన్ అల్ రషీద్ అనే ఖలీఫా మనకు చిరపరిచితుడు. కాని ఈయన కాలంనాటికి ఖలీఫాలు చక్రవర్తులలాగా భోగలాలసులై, తమ జీవితాన్ని మతప్రచారానికిగాక, కళల వ్యాప్తికి ఎక్కువగా వినియోగించారు. తొలి ఖలీఫాలు అలాకాక తమ జీవితాలను మతానికి, ధర్మానికి అంకితం చేసి, సాటి ముసల్మానులకు ఆదర్శ పురుషులుగా ఉంటూ వచ్చారు. అటువంటి వారే ఖలీఫా ఉమర్. ఆయన జీవితం నిరాడంబరంగా వెళ్ళిపోయింది. ఆయన ఇస్లాము మత ప్రచారం కోసం యుద్ధాలు చేశాడు. ఆ మత ధర్మాన్ని అందరికన్న హెచ్చుగా తానే అనుష్ఠించాడు. ఆయనను గురించి అనేక కథలు చెబుతారు.

ఉమర్ స్వార్థం ఎలాటిదో ఎరగడు. యెమెన్ రాజులు తనకు ఓడిపోయినప్పుడాయన వారి సంపదను ముసల్మానులందరికీ విచక్షణా లేకుండా సమంగా పంచిపెట్టాడు. ఇలా పంచిన వాటిలో చారలగుడ్డ కూడా ఉన్నది. ఇది అందరికీ తలా ముక్క వచ్చింది. దానితో ఆయన అంగీ కుట్టించుకున్నాడు.

ఒకనాడాయన మదీనా మసీదులో ఈ అంగీ ధరించి తన అనుచరులను "నాస్తికుల పైకి" యుద్ధానికి తయారు కమ్మని ఉద్బోధించసాగాడు. అప్పుడు

'కృపానంద్'





సభికులలో ఒకడు లేచి, "మేము నీ మాట వినము," అన్నాడు.

"ఎందుకు వినరు?" అని ఉమర్ అడిగాడు.

"యెమన్ చారలగుడ్డ ముక్కలు అందరికీ సమంగా పంచుతానన్నావు. నీ విప్పుడు ధరించిన కొత్త అంగి దానితో తయారు చేసినది. నీవు అంత పొడుగైన వాడివి, నీ వంతుకు వచ్చిన ముక్కతో అంత పెద్ద అంగి ఎలా వచ్చింది?" అని సభికుడు సవాలువేశాడు. ఉమర్ తన కొడుకు అబ్దుల్లా కేసి తిరిగి, "ఈ మనిషి చేసిన సవాలు న్యాయమైనది. సమాధానం చెప్పు," అన్నాడు.



అప్పుడు అబ్దుల్లా లేచి, "ముసల్మానులారా, మన నాయకుడికి కొత్త అంగి కుట్టించుకోవాలనిపించింది. ఆయన వంతు వచ్చిన గుడ్డముక్క అంగికి చాలకపోతే నా వంతు వచ్చిన ముక్కకూడా ఆయనకే యిచ్చాను. ఈ అంగి లేకపోతే ఆయన మీ ఎదటికి రావటానికి బట్టలుకూడా లేవు," అని చెప్పాడు.

సవాలు చేసినవాడు, "యా అల్లా! మేము నీ మాట వింటాము!" అని పెద్దగా కేక పెట్టాడు.

ఉమర్ సిరియా, మెసపొటేమియా, ఈజిప్టు, పర్షియా మొదలైన దేశాలన్నిటిని జయించి, ఇరాక్‌లో బస్రా, కూఫానగరాలు స్థాపించి మదీనాకు తిరిగి వచ్చేసరికి ఆయన దుస్తులన్నీ చీలికలు పీలికలై ఉన్నాయి. ఆయన వాటితోనే మసీదు ముందుండే మెట్లపై కూచుని అందరూ చెప్పే ఫిర్యాదులు వింటూ, వీడు లక్షాధికారి అని, వీడు ఒంటెలు కాసేవాడని వివక్షత చూపకుండా అందరికీ న్యాయం చేశాడు.

ఆ కాలంలో కాన్‌స్టాంటినోపుల్‌ను పరిపాలించే క్రైస్తవరాజు మదీనాకు ఒక దూతను పంపుతూ, ఖలీఫాకు గల సాధన సంపత్తి ఎటువంటిదో, ఆయన బలం

ఎందులో ఉన్నదో రహస్యంగా తెలుసుకు రమ్మని హెచ్చరించాడు. ఆ దూత మదీనాకు వచ్చి అక్కడి పౌరులను, "మీ రాజుగారు ఎక్కడ ఉంటారు?" అని అడిగాడు.

"మాకు రాజు లేడు; అల్లా సేవకుడూ, ఆస్తికులకు నాయకుడూ అయిన ఖలీఫా మాత్రమే ఉన్నాడు. ఆయన మసీదు వద్ద కనిపిస్తాడు. అక్కడ ఆయన ఫిర్యాదులు వింటూ ఉంటాడు. లేదా నిద్రపోతూ ఉంటాడు," అని మదీనా పౌరులు దూతతో చెప్పారు.

మసీదుకు దారి తెలుసుకుని ఆ దూత వచ్చి చూసేసరికి, మిట్టమధ్యాహ్నం ఎండకు కాలే రాళ్ళమీద మేనువాల్చి, తల కింద దిండుకూడా లేకుండా ఉమర్ నిద్రపోతున్నాడు. ఆయన తల నుంచి కారే చెమట రాతిపై చిన్న మడుగు కట్టి ఉన్నది. అది చూసి రాజదూత కంగారుగా, "రాజాధిరాజులు ఈ పిచ్చగాడికి లొంగిపోయారు! ఒక పెద్ద సామ్రాజ్యానికి ఈయన అధినాయకుడు! ఇటువంటి వాడు ప్రజలకు ఏలిక అయితే మిగిలిన రాజ్యాలు ముసుకు వేసుకోవలసిందే!" అన్నాడు.

పర్షియాదేశానికి రాజధాని ఇస్తఖర్. అక్కడి రాజు ఓడిపోయి, ముసల్మానులు రాజసౌధాన్ని కొల్లగొట్టి నవ్వుతు చేరికిన





అమూల్యమైన వస్తువులలో అరవై మూరల చదరం గల ఒక రత్న కంబళికూడా ఉన్నది. దానిపై ఒక పూదోట చిత్రించి ఉన్నది. పూలన్ని రత్నాలతోనూ, కొమ్మలన్ని బంగారు తీగెతోనూ తయారుచేశారు. ముసల్మానుల సేనానాయకుడైన అబూ వక్కాసుకు దాని ఖరీదు అంచనా కట్టే శక్తి లేదు. అయినప్పటికీ అది చాలా విలువ అయినదని గ్రహించి దానిని ఖలీఫా ఉమర్‌కు బహూకరించాలని ప్రత్యేకంగా ఉంచాడు.

ఈ రత్న కంబళం తన చేతికి అందగానే ఉమర్ దానిని ముక్కలుగా కత్తిరించి,



మదీనాలో ఉండే నాయకుల కందరికీ తలా ఒక ముక్క ఇచ్చేశాడు. తాను ఒక్క ముక్కకూడా ఉంచుకోలేదు. ఈ ముక్కలలో ఒకటి ఇరవైవేల దిర్హాములకు అమ్ముడయిందట!

వర్తియాప్పై జరిగిన ఈ యుద్ధంలోనే ముసల్మానులకు లొంగిన సామంతులలో హర్ముజాన్ అనేవాడున్నాడు. తన భవిష్యత్తు ఖలీఫా స్వయంగా నిర్ణయించే షరతుపైననే ఈయన లొంగి వచ్చాడు. ఆయనను ఇద్దరు ముసల్మాను వీరులు మదీనాలో ఉన్న ఉమర్ వద్దకు తీసుకువచ్చి, ఈ సామంతు చాలా గొప్ప హోదాగల వాడని, అందుచేతనే ఆయనను రాజ లాంఛనాలు ధరించ నిచ్చామని ఉమర్‌తో మనవి చేసుకున్నారు.

ఉమర్ మసీదు ఆవరణలో చింకి బట్టలతో, ఒక చింకి చాపపై ఒంటరిగా కూచుని ఉన్నాడు. తలకు తురాయి జలతారు ఉపవస్త్రమూ ధరించి ఉన్న సామంతు ఖలీఫాను చూసి విస్మయం చెందాడు. ఖలీఫా ఆ సామంతును చూసి, "ఆహా, అల్లా మహిమ! నీ వంటి వానిని అణచడానికే ఆయన ఇస్లామును అవతరింపజేశాడు!" అని సింహగర్జన చేశాడు.





తరవాత ఖలీఫా సామంతు ధరించిన రాజోచితమైన దుస్తులన్నీ ఊడదీయించి, గవ్వకొరగాని ఒక ముతక దుప్పటి ఇచ్చి, "ఇప్పుడు నీకు తగిన దుస్తులు ధరించావు. చెప్పు, ఇప్పుడు సర్వసంపన్నుడు ఈశ్వరుడే నని అంగీకరిస్తావా?" అని అడిగాడు.

"ఇది ఈశ్వరుడి పనే అయి ఉండాలి మరి. ఆయన తటస్థంగా ఉండిపోయి నప్పటికీ మేము మిమ్మల్ని జయించి ఉండే వారమే. మా గత చరిత్రను బట్టి నేనా మాట ధాటిగా చెప్పగలను. ఆ ఈశ్వరుడుకూడా మీ పక్షాన చేరి పోరాడబట్టే మాకు అపజయం కలిగింది," అన్నాడు పర్షియాదేశపు సామంతు.

ఈ మాటలలోని వ్యంగ్యం బోధపడే సరికి ఖలీఫా కనుబొమలు రౌద్రంగా ముడి పడ్డాయి. తనకు మూడిందని సామంతు అనుకున్నాడు. తనలో తల ఎత్తిన ప్రాణ భయాన్ని కప్పి పుచ్చటానికాయన దాహ మైనట్టు నటిస్తూ, మంచినీరు కావాలని అడిగాడు. ఆయనకొక మట్టిపాత్రలో మంచి నీరు అందించారు. అది చేత పట్టుకుని, తాగకుండా ఖలీఫా కేసి చూశాడు.

"ఎందుకు జంకుతున్నావు?" అని ఉమర్ అతన్ని అడిగాడు.

"నేను నీరు తాగుతూండే సమయంలో ఎవరైనా నన్ను పొడిచేస్తారేమోనని అనుమానంగా ఉంది," అన్నాడు సామంతు.

"అలాటి శంకల నుంచి అల్లా నన్ను కాపాడుగాక! ఆ నీటితో నీ నోరు తడిసి, నీ దాహం తీరేవరకైనా నీకు ఏ అపాయమూ జరగదని అభయం ఇస్తున్నాను," అన్నాడు ఉమర్.

ఈ మాట వింటూనే సామంతు హర్ముజాన్ తన చేతిలోని పాత్రను మెట్లమీద విసిరి పగలగొట్టాడు. ఉమర్ అతన్ని శిక్షించకుండా విడిచిపుచ్చి తన మాట చెల్లించుకున్నాడు. ఆయన ఔదార్యానికి

ముగ్ధుడై హర్ముజాన్ ఇస్లాంమతం స్వీకరించి చాలా ప్రతిష్ఠ గడించాడు.

జెరుసలేము నగరం ముసల్మానులకు లొంగిపోయినప్పటికి అది క్రైస్తవుల పుణ్య క్షేత్రంగా ఉండేది. సోఫ్రానియస్ అనే ఆయన ఆ నగరానికి ప్రధాన గురువు. ఖలీఫా స్వయంగా వచ్చే పక్షాన నగరాన్ని ఆయనకే స్వాధీన పరుస్తానని సోఫ్రానియస్ అన్నాడు. ఈ సంగతి తెలిసి ఉమర్ మదీనా నుంచి ఒంటరిగా బయలుదేరి జెరుసలేము నగరానికి వచ్చాడు. ఆయన ఎక్కిన ఒంటెపైన ఉన్న మూటలలో ఒకటి ఒంటె మేత, రెండవ దానిలో ఖర్జూర కాయలు. వీటితోబాటు ఒక కొయ్య కంచమూ, మంచినీటి తిత్తిమాత్రమే తీసుకుని ఉమర్ అహోరాత్రాలు ప్రయాణం చేశాడు. ప్రార్థనలు చెయ్యటానికీ, దారిలో తటస్థపడిన ముఠాల వాళ్ళ తగాలు తీర్చటానికీ మాత్రమే ఆయన ఆగుతూ వచ్చాడు. నగర స్వాధీన పత్రంపై సంతకం చేసి ఆయన నగరంలో ప్రవేశించాడు.

ఉమర్, సోఫ్రానియస్ నగరంలో నడుస్తూండగా ఒక క్రైస్తవుల చర్చి కనిపించింది. దానిని చూడగానే తాను భగవద్ధ్యానం చేసుకునే వేళ అయిందని ఉమర్‌కు జ్ఞాపకం వచ్చింది. తాను ధ్యానం చేసుకోవ



టానికి ఏదైనా చూపించమని అడిగితే సోఫ్రోనియస్, చర్చిలో చేసుకోవచ్చునన్నాడు.

"మీ మతం సరి అయినది కాదని నాకు తెలుసుగాని, నేను మీ చర్చిలో ప్రార్థన చెయ్యను; ఎందుకంటె నేను ప్రార్థన చేసిన స్థలాన్ని మా ముసల్మానులు తక్షణమే స్వాధీనపరుచుకుంటారు," అన్నాడు ఖలీఫా.

ఆయన తన ప్రార్థన పూర్తి అయాక క్రైస్తవమత గురువుతో, "మా ముసల్మానుల కోసం మసీదు కట్టుకునేటందుకు తగిన స్థలం చూపండి," అన్నాడు.

సోఫ్రొనియస్ ఖలీఫాను సులేమాన్ దేవాలయం ఉండిన స్థలానికి తీసుకుపోయి అక్కడ మసీదు కట్టుకోమన్నాడు. ఆ ప్రదేశంలో ఒక పవిత్రమైన శిల ఉన్నది. దానిని జెకర్ శిల అంటారు. ఆ శిల నిండా చెత్తా చెదారం వేసి ఉన్నది. ఖలీఫా ఎవరితోనూ ఏమీ అనకుండా, ఆ చెత్త కొంత తీసి తన ఒడిలో వేసుకుని దూరంగా తీసుకుపోయి పారేశాడు. ఆ విధంగా ఆ ప్రదేశం శుభ్రం చేయబడి అక్కడ ఉమర్ మసీదు వెలిసింది. అది ఇప్పటికి ఉన్నది.

ఉమర్ తన జీవితమంతా మక్కాలోనూ, మదీనాలోనూ గడిపాడు. ఆయన చిరుగుబొంతలు తప్ప ధరించలేదు. ఆ చింకిపాతలతో, చేతిలో ఒక కర్ర పట్టు



కుని వీధుల వెంట తిరుగుతూ ఎవరెవరు ఏయే మోసాలు చేస్తున్నారో కనిపెట్టేవాడు. వర్తకులు హెచ్చు ధరలు పుచ్చుకుంటే మందలించే వాడు. మరి క్షమించ రాని నేరంచేస్తే కర్రతో కొట్టేవాడుకూడా.

ఒకనా డాయన పాలూ, పెరుగూ అమ్మే వీధిగుండా పోతూ ఒక ముసలిది చేస్తున్న మోసం గమనించాడు. ఆయన ఆమెను సమీపించి, "ఏమమ్మా, సాటివాళ్ళను అలా మోసం చేయవచ్చునా? ఇంకెప్పుడూ పాలలో నీళ్ళు కలపకు," అని హెచ్చరించాడు. ఆమె తప్పు ఒప్పుకున్నది.

మర్నాడు ఖలీఫా అటుగా వచ్చి ఆ ముసలిది ఎప్పటిలాగే పాలలో నీరు కలుపుతూ ఉండటం చూసి, "దుర్మార్గురాలా, పాలలో నీరు కలప వద్దని నిన్ననే గదా నీకు చెప్పాను?" అన్నాడు.

"ప్రమాణపూర్తిగా చెబుతున్నాను, నే నలాటి పని చెయ్యలేదు," అన్నది ముసలిది. ఆమె అలా ప్రమాణం చేసేసరికి దుకాణం లోపలి నుంచి ఆమె కూతురు బయటికివచ్చి, "అమ్మా నీవు వారితోనె అబద్ధాలాడుతున్నావా? చేసిన మోసానికి తోడు అబద్ధంకూడానా? అల్లా నిన్ను క్షమిస్తాడా?" అన్నది.

ఖలీఫా మనసు ఈ మాటలకు నిండిపోయింది. ఆయన ముసలిదాన్ని మందలించటానికి బదులు తన కొడుకులైన అబ్దుల్లా, అకీముల కేసి తిరిగి, "ఈ సద్బుద్ధి గల పిల్లను మీ ఇద్దరిలో ఎవరు పెళ్ళాడుతారు? ఆమె కడుపున అల్లా ఆమె అంత మంచి పిల్లలనే కలిగిస్తాడు!" అన్నాడు.

అకీము ఆ పిల్లను పెళ్ళాడటానికి అంగీకరించాడు. ఖలీఫా కొడుక్కూ, పాలదాని కూతురికీ వైభవంగా వివాహం జరిగింది. వారి దౌహిత్రుడైన అబ్దుల్ అజీజ్ అనేవాడు ఖలీఫా అయి అయిదుగురు గొప్ప ఖలీఫాలలో ఒకడుగా ప్రసిద్ధి కెక్కాడు.



# పూరీ జగన్నాథాలయం

పూరి ఒరిస్సా రాష్ట్రంలో తూర్పు సముద్ర తీరాన ఉన్నది. ఇక్కడి జగన్నాథాలయం జగద్విఖ్యాతమైనది. 12 వ శతాబ్దంలో నిర్మించిన ఈ ఆలయం ఎత్తు 192 అడుగులు. దీని శిఖరం మీద విష్ణు చక్రమూ, జెండా ఉన్నది. ఆలయపు తూర్పు ద్వారానికి ముందుగా అత్యంత మనోహరంగా చెక్కిన నలుపు రాతిస్తంభం ఒకటి ఉన్నది.

జగత్ప్రసిద్ధిగన్న కోహినూర్ వజ్రాన్ని జగన్నాథాలయానికి ఇస్తానని మహారాజా రంజిత్ సింగ్ వాగ్దానం చేశాడట. కాని ఆయన అనంతరం ఆయన వారసుడు ఆ వాగ్దానాన్ని నిలబెట్టలేదు.

ఏటా ఆషాఢ శుద్ధ దశమికి పూరిలో స్వామికి ఉత్సవం జరుగుతుంది. ఆ రోజు జగన్నాథస్వామిని ఒక పెద్ద రథంలో పెట్టి ఊరేగిస్తారు. ఇది చాలా పెద్ద రథం. దీని ఎత్తు 45 అడుగులు. రథపు పలక 25 అడుగుల చదరం ఉంటుంది. ఈ రథానికి 16 చక్రాలు. ఒక్కొక్క చక్రమూ 7 అడుగుల వ్యాసం గలది. ఈ రథాన్ని ప్రజలే లాగుతారు.





# ప్రశ్నోత్తరాలు

1. *గుండారపు శ్రీమూర్తులు, పిఠాపురం*

"చందమామ" ఏ తారీకు, ఏ నెల, ఏ సంవత్సరము నుంచి వెలువడు చున్నది?

తారీకు 25, నెల జూన్, సంవత్సరము 1947.

2. *బి. విజయలక్ష్మి, వనపర్తి*

అన్నయ్యా, ప్రతినెల "చందమామ" ఎన్ని వేలు ప్రచురిస్తారు?

ఇప్పుడు "చందమామ" ఆరు భాషలలోనూ కలిపి రెండున్నరలక్షలు ప్రచురిస్తు న్నాము. అందులో తెలుగు ఒకలక్ష.

3. *కొల్లా వెంకటేశ్వరరావు, తెనాలి*

పాఠకుల లేఖలకు పూర్తి పేజి కేటాయించిన బాగుండునని నా అభిప్రాయము—

అలాగే కేటా యిస్తున్నాం. అక్టోబరు సంచికలో మాత్రమే కారణాంతరాలవల్ల అర పేజీ వేశాం.

4. *జమంది అప్పారావు, విశాఖపట్నం*

మామా, "భారతచరిత్ర"కు అవసరమగు రచనలు మేమును పంపవచ్చా?

అది పాఠకుల శీర్షిక కాదు.

5. *ఎస్. రసూల్, గూడూరు*

అన్నయ్యా, మేము స్వయంగా కథలు వ్రాసిన "చందమామ"లో ప్రచురిస్తారా?

"చందమామ"లో ప్రచురించటానికి యోగ్యమైన కథలు నీవు స్వయంగా వ్రాయ గలవా?

6. యలమర్తి నాగవెంకట సత్యమీనాకుమారి, ఆత్రేయపురము

ఫొటోవ్యాఖ్యల పోటీకి ఒకే కార్డుపైన 3 లేక 4 వ్యాఖ్యల సెట్లు ఒకరు వ్రాసి పంపవచ్చునా?

అవశ్యం పంపవచ్చు. ఒక కార్డు మీద 15, 16 సెట్లు పంపుతున్నవారుకూడా ఉన్నారు.

7. రమణామూర్తి, బాండెల్ (బిహారు)

నేను సిందుబాదు కథలను వరుసగా సులభశైలిలో...ప్రచురించుటకు ముందు ఏ ఏ నిబంధనలను పాటించవలెనో తెలియపరచ గోరుచున్నాను.

సిందుబాదు కథలు అయిపోతే "చందమామ"లో వరుసగా వేస్తాం.

8. విస్సాజీరావు, భోపాల్

గేయాలు పంపిస్తే అందరికి చెబుతావా? లేక దాచేసుకుంటావా?

గేయాలు పంపవద్దు. ప్రస్తుతానికి "చందమామ"లో గేయకథకు తప్ప ఇతర గేయాలకు స్థానం లేదు.

9. ఎన్. శంకర్రావు, కోరాపుట్

"చందమామా", నిన్ను గత పది సంవత్సరములుగా చదువుచున్నాను. నీలో ఇంతవరకు అచ్చు తప్పు పట్టలేదు. కాని సెప్టెంబరు సంచికలోని "ప్రశ్నోత్తరాలు" శీర్షికలో—

"చందమామ"లో సాధ్యమైనంతవరకు అచ్చు తప్పులు రాకుండా చాలా జాగ్రత్త పడతాము. అయినా అప్పుడప్పుడూ ఒకటి అరా తప్పు పడుతూనే ఉంటుంది.

10. కె. సుగుణలక్ష్మి, ఆచంట

ప్రతి పూర్ణిమనాడూ తాతయ్య కథలు చెప్పేవాడు గదా, ఈ మధ్య మానేశాడు—

తాత్కాలికంగా తాతయ్య దూరం వెళ్ళిపోయాడు. మళ్ళీ పిలిపించటానికి ప్రయత్నం చేస్తున్నాం.

11. కుమారి కొడమంచిలి సుబ్బలక్ష్మి, ఆచంట

బేతాళ పంచవింశతి అంటే 25 కథలే గదా, ఎక్కువ కథలు ఎలా వచ్చాయా అని సందేహం.

బేతాళ పంచవింశతిలోని కథలు కాని వాటి కింద "కల్పితం" అని వేస్తున్నాము.

Photo by P. Krishna Kumar



బహుమతి

పూలకు అందము కరువా!

పంపినవారు,

Photo by V. Thithu



బహుమతి

౯౫

చెట్టుకు కాయలు బరువా!

పంపినవారు:

జి. రామారావు, గణేశపురం

# భారతం

భీమ దుర్యోధనుల గదాయుద్ధం సరస్వతీ నది దక్షిణ తీరాన జరిగింది. బలరాముడూ, ధర్మరాజూ, అర్జున నకుల సహదేవులూ, ఇతర రాజులూ వలయంగా ఏర్పడి యుద్ధం చూశారు. గదాయుద్ధానికి ముందు వాగ్యుద్ధం జరిగింది. తరవాత భీమ దుర్యోధనులు ఒకరి నొకరు గదలతో భయంకరంగా కొట్టుకున్నారు. ఒకరినొకరు పడగొట్టారు. భీముడు పడిపోతే మిగిలిన పాండవులు భయపడ్డారు, దుర్యోధనుడు పడిపోయినప్పుడు సంతోషంతో శంఖ నాదాలు చేశారు, ఇద్దరూ సమంగానే పోట్లాడారు.

వారి విధంగా యుద్ధంచేస్తుంటే అర్జునుడు కృష్ణుణ్ణి, "ఈ ఇద్దరిలో ఎవరు అధికులు?" అని అడిగాడు. దానికి కృష్ణుడు, "భీముడికి బలం హెచ్చు, దుర్యోధనుడికి నేర్పు హెచ్చు. న్యాయయుద్ధం చేసి భీముడు దుర్యోధనుణ్ణి ఎన్నటికీ చంపలేడు. మాయచేతనే చంపాలి. దుర్యోధనుడి తొడలు విరగగొట్టుతానని భీముడు ప్రతిజ్ఞచేసి ఉన్నాడుగదా. అన్యాయమైనప్పటికీ భీముడు ఆ పని చెయ్యటం మంచిది. లేకపోతే ఈ యుద్ధంలో సంపాదించుకున్న విజయం కాస్తా వృథా అయి పోవచ్చు," అన్నాడు.

అర్జునుడు ఈ మాట విని భీముడు చూస్తుండగా తన ఎడమతొడ చరుచుకున్నాడు. భీముడికి ఆ సంజ్ఞ అర్థమయింది అతను అవకాశం చూసుకుని తన ఇనప గదతో దుర్యోధనుడి తొడపైన కొట్టాడు. తొడలు విరిగి దుర్యోధనుడు కుప్పకూలి పోయాడు. భీముడు దుర్యోధనుడి తలను తన్ని, "ఆ నాడు సభలో ద్రౌపదిని చూచి నవ్వినందుకు అనుభవించు," అన్నాడు.

భీముడు దుర్యోధనుడి తలను తన్నటం కొందరికి అధర్మ మనిపించింది. ధర్మరాజు అతనితో, "నీ పగ తీర్చుకున్నావు. ఇక అంతతో పోని. ఈ స్థితిలో ఇతన్ని చూసి మనం విచారించాలి గాని, నవ్వటానికేమున్నది?" అంటూ దుర్యోధనుడితో, "నాయనా, మా మీద ఆగ్రహించకు, నన్ను నీవు నిందించుకోకు. మనకూ మనకూ ఈ వైరం కలగటం కేవలం విధికృతం. అందరినీ పోగొట్టుకుని మేమూ దీనస్థితిలోనే ఉన్నాం. ధృతరాష్ట్రుడి కోడళ్ళ చేత తిట్లుతినటమే మాకు మిగిలింది," అన్నాడు

భీముడు చేసిన పనికి బలరాముడు మండిపడ్డాడు. "ఛీ, ఛీ! శాస్త్రం తెలియని ఈ మూఢుడు ధర్మయుద్ధం చేసే దుర్యోధనుణ్ణి బొడ్డుకు కిందుగా కొట్టాడు!" అంటూ ఆయన తన నాగలి ఎత్తి భీముడిపైకి వెళ్ళాడు. కృష్ణుడు వెళ్ళి ఆయనను పట్టుకుని శాంతపరుస్తూ, "అన్నా, భీముడు ఈ దుర్యోధనుడి తొడలు విరగగొట్టుతానని ఏనాడో శపథం చేశాడు ఆ శపథం ఇప్పుడు నెరవేర్చుకున్నాడు. అతనిపై ఆగ్రహించకు," అన్నాడు.

బలరాముడి వాదంతో తృప్తిచెందక అప్పటి కప్పుడే రథమెక్కి, ద్వారకకు ప్రయాణమై వెళ్ళి పోయాడు. అయితే చాలామంది భీముడు చేసిన పనిని శ్లాఘించి అతనిని అభినందించారు.

# ఫొటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 జనవరి సంచికలో ప్రకటించబడును.





★ పై ఫొటోలకు సరిపడిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని ఉండాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబరు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫొటో: పూలకు అందము కరువా!

రెండవ ఫొటో: చెట్టుకు కాయలు బరువా!

పంపినవారు: జి. రామారావు,

గణేశపురం, కొత్తగూడెం కాలరీస్.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ




ఒకరోజున దాసూ, వాసూలు స్కూలు నుంచి ఇంటికి వస్తూండగా, చెరువులో చేపలు పడుతున్న ఒక కొంటెకుర్రాడు కనిపించాడు. వాడికి అంత దూరంలో పెద్ద బుట్ట ఒకటి వున్నది. దాసూ వాసులు వాణ్ణి బుట్టలోవున్న దేమిటో చూపించ మన్నారు. దానికి వాడు కోపంగా, "ఆ బుట్టలో చేపతలా, చేపతోకా వున్న, ఒక వింత మొసలి వున్నది! దాన్ని చూడాలంటే, మీ 'టైగర్' ని, నా కివ్వండి," అన్నాడు. ఇంతలో టైగర్ మెల్లిగా వెళ్ళి, బుట్టలో వున్న దాన్ని నోట కరుచుకుని, పారి పోసాగింది. "అయ్యో, టైగర్ నా చేపని ఎత్తుకు పోతున్నది," అని కేకలు పెడుతూ, కొంటె కుర్రాడు దాని వెంటపడ్డాడు.




Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works,



శుభదీపావళి!

'నా అభిమాన లక్స్
4 వానవెల్లి
రంగులలో
మరియు తెలుపులో కూడావున్నది!'
అని సావిత్రి చెప్పుచున్నది!



సినీమాతారలకు సౌందర్యమునిచ్చే




LTS.106-X29 TL.

హిందుస్థాన్ లీవర్ తయారీ

## "ఆల్విటోన్‌నే
## శిఫారసు చేస్తున్నది ఎందుచేతనంటే...

అది సుఖనిద్రనూ అధిక శక్తినీ కలిగిస్తుంది.
దినమంతా శ్రమించిన ఆయాసం పరిహరించి హాయినిస్తుంది"

- శరీరానికి పెరుగుదల కలిగించు
- అనుగుణ గని విలువ శీఘ్రంగా కరుగుతుంది
- ఎప్పటికంటె అధిక ప్రమాణం కలది
- ఎప్పటికంటె బాగుపరచబడ్డ శ్రేష్ఠత కలది.

# ఆల్విటోన్

నియమిత ఆహార పానీయము
అత్యంత ఆరోగ్య పద్ధతిని
ఆధునిక యంత్రపరికరాలతో తయారైనది.






EP

తయారీద:
ఆర్లిడోవ్ ల్యాబొరేటరీస్, మదరాసు-16.



రోజూ కొన్ని
భుజించండి...

# రావల్గావ్

స్వీట్లు
మరియు టాఫీలు

అమ్మకపు ఏజెంట్లు :
మెస్సర్స్. మోతీలాల్ గిర్ధారిలాల్ అహూజ్కర్,
మాలెగావ్, జిల్లా : నాసిక్

---



# బ్రాహ్మీ ఆమలా

కేశవర్ధక్ తైలం

ధూతపాపేశ్వర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ పన్వెల్. బొంబాయి

జ్వరం వచ్చినట్టుందా?

రవ్వంత **అమృతాంజనము** రాయండి

నిమిషంలో తగ్గుతుంది

జలుబూ, జ్వరాలూ, ఒళ్లు నొప్పులు – వీటన్నిటికీ అమృతాంజనం ఉపయోగించండి. మీ కుటుంబానికి అది శ్రీరామరక్ష. నొప్పి కలిగినప్పుడు ఒక్క పిసరు రాస్తే చాలు ఇంట్లో ఒక్క సీసా ఉంటే నెలలతరబడి అటివస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4

బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.



వాళ్ళను

ఎల్లప్పుడూ

ఉత్సాహంగా

వుంచటానికి

Nutrine

Sweets



న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్

చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

NC.39

---

వర్తక  గుర్తు

# ఐటియాల్ - 3

(ఆధునిక క్రిమినాశని)

"ఐటియాల్ - 3" ఒక ఆధునిక క్రిమినాశని. గాయములను కడుగుటకు, శస్త్ర చికిత్స ఉపకరణములను శుద్ధిచేయుటకు ఉపయుక్తమైనది.

తయారు చేయువారు:

**ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లెబొరేటరీ లిమిటెడ్,**

మల్లేశ్వరం :: బెంగళూరు - 3

★

వర్తక డిపోలు: 35/37, తంబుచెట్టి వీధి, మద్రాసు.
71/4, ఆర్కాట్ శ్రీనివాసాచార్ వీధి, బెంగళూరు - 2.






# స్పెక్ట్రమ్

## రంగు పెన్సిళ్లు

పిల్లల డ్రాయింగుకు, మ్యాప్-డ్రాయింగుకు చాలా అవసరం. అనేక రంగుల్లో దొరకును.

తయారుచేయువారు:

**ది మద్రాస్ పెన్సిల్ ఫ్యాక్టరి**

మద్రాసు - 21

# మీ ఇంట్లో ఇవి ఉన్నవా...?




స్పెన్సర్స్
గ్రైప్ సిరప్

పసిబిడ్డల
ఉదర బాధలకు




సి. ఎ. క్యూ.

చలి, జలుబు, నొప్పి, జ్వరం
మున్నగువాటికి



ఎక్సీమా

ఎగ్జిమా, చాకలి గజ్జి
మొదలగు అన్ని చర్మవ్యాధులకు

## స్పెన్సర్ & కం. లిడ్.

మాన్యుఫాక్చరింగ్ కెమిస్టులు
1/153 మౌంట్ రోడ్, మద్రాసు-2. ఇండియా

దీపావళి శుభసమయాన

మా అభిమాను లందరకూ

అభినందనము లర్పిస్తున్నాము



అందమైన ముద్రణకు

నెల్‌సన్ టైపులనే



ఉపయోగించండి

# నెల్‌సన్ అండ్ కో

## (ది ఫైన్ ఆర్ట్ టైప్ ఫౌండ్రీ)

స్థాపితము: 1916

చూళై: మద్రాసు-7. ఫోన్: 33122

ఫ్యాక్టరీ:—నం. 1, నెల్సన్ మాణిక్యమొదలియార్ రోడ్డు,

అమింజికర్రై, మద్రాసు-29. ఫోన్: 62036



"చందమామ" నెల్‌సన్ టైపులతోనే ముద్రింపబడుతున్నది

# వైట్ హార్స్ సబ్బు




**WHITE HORSE SOAP**

....గుడ్డల మురికిని పోగొట్టుటలో
అగ్రస్థానము వహించినది.
పట్టు, లినన్ గుడ్డల చలువకు శ్రేష్ఠమైనది.

బారు ఒకటి: రు. 1-00
పెద్ద సైజు కేకు: 0-31 న. పై.
మీడియం సైజు: 0-19 న. పై.
శాంపిల్ సైజు: 0-07 న. పై.

తయారుచేయువారు:

## నేషనల్ ఇండస్ట్రీస్,

మదరాసు - 21

---



మృదువైన చర్మమునకు

## ఫెస్టివల్ సూపర్ శాండల్ టాల్కం పౌడర్ అండు స్నో



ఫోన్: 51388

మురళి బ్రదర్స్ మదరాసు-21

తంతి: "Mursoka"

ప్రతిచోటా దొరకును

ఆంధ్ర ప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు

**M/s. శివకోటి లక్ష్మీనరసింహం,**

మార్కెట్ స్క్వేర్ :: విజయవాడ 135

ఫొటోగ్రఫి

ఎక్కడ వుంటుందో....

అక్కడల్లా..గెవార్ట్

GEVAERT




**ALLIED PHOTOGRAPHICS LIMITED**

అలైడ్ ఫొటోగ్రఫిక్స్ లిమిటెడ్,
కస్తూరి బిల్డింగ్, జంషెడ్జీ టాటా రోడ్, బొంబాయి.

సంతోషదాయకమైన ఈ దీపావళీ
పర్వకాలమున అందరకూ మా
స్నేహపూర్వకమైన శుభాకాంక్షలు



# పి. మునిరత్నం నాయుడు & సన్సు

కాగితములు, స్టేషనరీ వ్యాపారులు

స్థాపితం: 1913

10, స్ప్రింగర్ స్ట్రీట్ :: మదరాసు - 1

ఫోన్: 23513

తంతి: "STATIONERS"

హెడ్డాఫీసు:

వేలూరు

# సూపర్ ఫాస్ఫేటు

అంటే మీయొక్క భూములనుండి

అధిక పంటను

అధిక తరము

అధిక ఆదాయము

అమోఘమైన

ఉత్పత్తిని యిచ్చునది



సంకోచించకండి— సూపర్ ఫాస్ఫేటు ఉపయోగించండి

సదరన్ రీజియనల్ కమిటి

ఫెర్టిలైజర్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా P.B. No. 12, మద్రాసు—1.





"గుండమ్మ కథ"లో

అన్నదమ్ములు





"గుండమ్మ కథ"లో

అక్కచెల్లెళ్లు

